# విస్‌డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాస పత్రిక

సంపాదకవర్గం

సంపాదకుడు:
డాక్టర్ కె.వి.గోవిందరావు బి.ఎ.ఎం.బి.బి.ఎస్.

గౌరవ సహాయ సంపాదకులు:
టి.ఎల్.ఎన్.రావు బి.ఎస్‌సి.
వి.బాలకుమార్ ఎమ్.ఫార్మసీ

సభ్యులు:
కె.వి.ఎస్.గోవిందరావు
కె.వి.ఎస్.శరత్‌బాబు
కె.వి.ఎస్.విజయకుమార్
కె.రత్నకుమారి

చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1000.00 |
| జీవిత చందా | 250.00 |
| 3 సంవత్సరాలకు | 52.00 |
| సంవత్సర చందా | 18.00 |
| ఎయిర్ మెయిల్ (1 సంవత్సరం) | 80.00 |
| సీ మెయిల్ (1 సంవత్సరం) | 45.00 |

చందా పంపవలసిన చిరునామా:

విస్‌డమ్
6 వేంకటా రోడ్డు మైలాపూరు,
మద్రాసు-600004


# ఈ సంచికలో

సెప్టెంబరు 1985





ముఖచిత్రం-కలర్ ట్రాన్స్‌పరెన్సీ:
ఎన్. శివన్నారాయణ, మద్రాసు-17.

# తెలుగు విస్‌డమ్‌కు ఇది నాల్గవ సంవత్సరం

# ధ్యానం

## ఉత్తముడు మానవులలో పుష్పం వంటి వాడు



జేమ్స్ ఎలెన్

మానవులలో పుష్పం వంటివాడు ఉత్తమ గుణములు కలవాడు. అట్టి మానవుడు ఏ రోజు కా రోజు అహంకారం, దర్పం వంటి దుర్గుణాలను దరిచేరనీయకుండా పరిశుద్ధమైన మనస్సుతో, నిష్కలంకమైన మనోభావాలతో నిరంతరం భగవంతుని సామీప్య భావాన్ని అభివృద్ధి పరచుకుంటూ సారూప్యాన్ని ప్రకటించుకోగలుగుతున్నాడు. "నా శిష్యుడు అనేవాడు అహరహం ఆత్మత్యాగం చేయనీ" అనే నిర్వచనాన్ని ఎవ్వరూ

(మిగతా 8 వ పేజీలో)

"వివేకాన్ని విసర్జించడం కాదు,
అధిగమించడమే ఆధ్యాత్మికత."

# సంపాదకుని పేజీ

## తల్లి చెప్పిన విద్యే విద్య

"భూషలు గావు మర్త్యులకు భూరిమయాగద తార హారముల్" అన్నాడు ఒ కవి. నిజమే వేషం ఎలా ఉన్నా సత్ప్రవర్త ముఖ్యం. ఒక వ్యక్తి బాగా చదువుకోవచ్చు డిగ్రీలు సంపాదించుకోవచ్చు. సత్ప్రవర్త శూన్యం. డిగ్రీలు సద్వినియోగం చేసుకు ఉపకారం పొందితే పొందవచ్చుగానీ డి లకు, సత్ప్రవర్తనకు సంబంధం లేదు. ఎం చదువుకున్నా, ఎంత నేర్చుకున్నా విద విహీనులులా ప్రవర్తించేవాళ్ళను ఎంత మందిని చూస్తున్నాం

మంచి నడవడి, సత్ప్రవర్తన మం మర్యాదను తెలియజేస్తుంది. ఈ మర్యా ఇంట్లోనే ప్రారంభమవుతుంది. 'ఆ తానులో ముక్కే' అంటారు. అంటే ఒక తం కొడుకు తండ్రిలాగే ఉంటాడు అని అర్థ తండ్రి ఉత్తముడుగా ఉంటే కొడుకు మంచి గుణాలు అలవడతాయి.

మార్గాన్ని చూపించు, పెరిగిన తరువాత మార్గాన్ని వదలడు' అని కా[illegible] చె తున్నాయి. బాలామంది తలిదం[illegible] త పిల్లలను స్కూలుకు పంపించేస్తే తమ వ పూర్తి అయిందనుకుంటారు. బాధ్యత తీరిం అని సంతోషిస్తారు. కాని తల్లిదగ్గర నేరు

—సర్వేపల్లి రాధాకృష్ణ

తున్న విద్యే విద్య అని వాళ్లు తెలుసు కోలేక పోతున్నారు.



నేటి విద్యార్థుల పరిస్థితులు చూస్తే రెండు విషయాలు విదితమౌతున్నాయి. 1. నే చెప్పేది చెయ్ కాని నే చేసేది చేయకు. 2. నే చేసినదే నీవు చేయాలి అది తప్పైనా ఒప్పైనా సరే.

పాఠ్య పుస్తకాలలోనే అన్నీ ఉన్నాయని సంతుష్టిపడి ఊరుకునే తల్లిదండ్రులు చివరకు మోసపోతున్నారు. ఎంత చదివినా ఎన్ని డిగ్రీలున్నా సత్ప్రవర్తన ఎంతో ముఖ్యం.

వెనుక నీళ్ళలో ఈత బాగా చేతకాని ఒక తేలు తనని అద్దరికి చేర్చమని తాబేలుని అడిగింది. దానికి తాబేలు "నేను చేర్చను, నిన్ను వీపుమీద పెట్టుకుని ఈదుకుంటూ వెడుతుంటే దారిలో నన్ను కుట్టేస్తావు. నేను మునిగిపోతాను" అంది. "నేను కుడితే నువ్వు మునిగిపోతే నేనూ మునిగిపోతాను తెలియదా? ఆహా ఎంత తెలివి నీది" అంది తేలు. 'నిజమే? అయితే రా? ఎక్కి కూర్చో!' అంది తాబేలు. తేలు తాబేలుమీద ఎక్కింది. ఈ ఆ గట్టుకి రెండూ ప్రయాణం మధ్య దారిలో తేలు తాబేలుని కుట్టింది. రెండూ నీటిలో మునిగిపోయాయి మునుగుతూ 'ఎందుకు కుట్టావు?' అని తాబేలు అడిగింది. 'అది నా గుణం. తెలివితేటలకు దీనికి సంబంధంలేదు. అది నా నైజం' అంది తేలు.

కాబట్టి విద్య వేరు. బుద్ధి వేరు. వీటికి, నడవడికి సంబంధం లేదు. అసలు చదువుకోకపోయినా, తక్కువ చదువు ఉన్నా మంచి నడవడి కలవారు ఎందరో ఉన్నారు.

---

(2 వ పేజీ తరువాయి)

అపార్థం చేసుకోలేరు. సద్గుణాలతో కూడిన సత్ప్రవర్తనకు ప్రత్యామ్నాయం లేదు. మానవుడు ఉద్యమించి ఇట్టి మంచి నడవడిని సాధించకుండా పొందగలిగి అనుభవించేది శూన్యం.

ఉత్తమ గుణాలతో కూడిన సత్ప్రవర్తనను సాధించడానికి ఒకే మార్గం - అహంకారం, దర్పం, ఈర్ష్య అసూయ, విరోధం మొదలైన దుర్గుణ రాశిని దరి చేరనీయక పోవడమే. మనస్సులో ఉద్భవించే స్వాభిలాష, స్వార్థపరాయణత, నేను, నాది అనే కలుపు మొక్కలను సమూలంగా నాశనం చేసుకోవాలి. దురాలోచనలకు తావు ఈయకూడదు. మూర్ఖత్వాన్ని వదలుకోవాలి.

"ఆత్మ సంతృప్తిని పొందే విధానం తెలుసుకోడమే ప్రపంచంలో అతి ముఖ్యమైన విషయం." —మైకెల్ డిమాంశే

# గగనంలో అగ్గిపుల్ల ప్రామ

ఎరిక్ పీటర్‌సన్

నిప్పును రాజేసుకుని దానివల్ల పుట్టిన తాపాన్ని తనకు అనువుగా వాడుకోటం తెలుసుకున్న మానవుని మేధాశక్తి ఎంతో అద్భుతమైనది.



మొదట మానవుడు సహజంగా మేఘాలలో ఏర్పడే మెరపులతోనో, భూగర్భంలోనుంచి వచ్చే వాయువుల మంటలతోనో, సూర్యుని నుండో నిప్పును చేసుకునేవాడు.

కాలక్రమేణా నిప్పును కృత్రిమంగా తయారు చేసుకునే విధం మానవుడు తెలుసుకున్నాడు. చకుముకి (flint) రాతితో గంధకపు రాతి (pyrite) ని కొట్టి నిప్పు చేసుకోడం సుమారు 9000 సంవత్సరాలనాటిది. గంధకపు రాతిని చకుముకి రాతితో కొట్టినప్పుడు పుట్టే నిప్పు నెరుసులు సులభంగా అంటుకునే పదార్థం (Tinder) మీద పడేటట్టుచేసి నిప్పును కలిగించుకునేవారు. ఇది అంత సులభ సాధ్యం కాదు. చాలా ప్రయాసతో కూడిన పని. ముఖ్యంగా ముసురు బట్టిన రోజుల్లో నిప్పును తయారుచేసుకోడం మహా కష్టంగా ఉండేది. కొన్ని గంటల తరబడి ప్రయత్నించవలసి వచ్చేది.

తరువాత లోహయుగం ప్రారంభం.

## ముఖచిత్ర వ్యాఖ్య

(జూలై 1985)

"భాషకు అందని అందం
'విస్‌డమ్' బొమ్మ ముఖారవిందం."

—ఏ. గీతాంజలి, పొన్నూరు.

• • •

"కాటుక కన్నుల చెల్లెమ్మ
కట్నం కావాలి లే వమ్మ."

కె. విజయకుమార్, హైదరాబాద్.

• •

"అంత లేపి కళ్ళలో
ఎంత లేపి ఆశలో"

—కె. సత్యనారాయణ
బుచ్చిరాజుపాలెం పోస్టు, విశాఖపట్టణం.

---

"ప్రయత్నించకుండా సవ్యతను అనుసరించడం కాదు,
ప్రయత్నించి పాతను అనుసరించడమే జీవితంలో విర్లిప్తత." —అబ్రహాం లింకన్

అయింది. గంధకపు రాతికి బదులుగా ఇనుప ముక్కను ఉపయోగించి కొంచెం సులభంగా నిప్పును తయారు చేసుకోడం తెలుసు కున్నారు. ఇదీ అంత సులభం అనిపించ లేదు. ఒక కొయ్యపై మరియొక కొయ్య



రాపిడివల్ల నిప్పును పుట్టించుకునేవారు. ఒక మెత్తని కొయ్యమీద గట్టి కొయ్య ముక్కతో రాపిడిచే పుట్టిన అగ్నితో మెత్తని కొయ్యను అంటించటం మరో ప్రాచీన పద్ధతి. ఈపద్ధతి సుమారు 5000 సంవత్సరాల నాటిది. ప్రపంచంలో అక్కడక్కడ ఇంకా ఈ పద్ధతి ప్రత్యేక సమయాల్లో అనుసరిస్తారు.

నెపోలియన్ నాటి కాలంలో కూడా ధని కులు, పేదవాళ్ళు అనే భేదం లేకుండా అందరూ చకుముకి రాతిని ఉపయోగించి నిప్పును చేసుకునేవారు. 1832 వ సం.లో సుప్రసిద్ధ ఆంగ్లేయ రచయిత చార్లెస్ డికెన్స్ వర్షాకాలంలో నిప్పు పుట్టించడానికి అదృష్టం ఉండాలని చెప్పాడు.

రాను రాను నాగరకత అభివృద్ధిని పొందు తున్న కొద్దీ పిస్టల్ వాడుకలోకి వచ్చింది. సాధారణ పిస్టల్‌కు బదులు ఫైరు పిస్టలు వాడి నిప్పును కలిగించుకునేవారు. రాసాయనిక పద్ధతిలో తుపాకి మందు (gun powder), సల్ఫ్యూరిక్ ఆసిడ్, భాస్వరం ఉపయోగించి నిప్పు పుట్టించడం 18 వ శతాబ్దంలో ప్రారంభ మైంది. గంధకం ఉపయోగించిన పుల్లలు తప్ప పై రాసాయనిక విధానంలో తయారైన అగ్గిపుల్లలు చాలా అపాయకరమైనవి. వ్యయ ప్రయాసలతో కూడినవి.

దీని తరువాత ప్రొమేథియన్ (promethean matches) అగ్గిపుల్లలు వాడకం లోకి వచ్చాయి. విట్రియల్ (Vitriol) మందును అగ్గిపుల్లల చివర పెట్టి గాజు పెట్టెల్లో పెట్టేవారు. వీటివల్ల సులభంగా నిప్పు లభించినా చాలా అపాయకరంగా ఉండేవి. ఎక్కువ సొమ్మును కూడా వెచ్చించవలసి వచ్చేది. 1830 సం లో గంధ కపు అగ్గిపుల్లలు బయలుదేరాయి. ఇవి

---

## ప్రపంచంలో అతి పురాతనమైన గృహం

రోడ్స్ లివింగ్‌స్టన్ మ్యూజియం క్యూరేటరు మరియు పురావస్తు శాస్త్రజ్ఞుల బృదంచేరి ఉత్తర రొడీషియా కలోంబో జలపాతం దగ్గర 57,000 సంవత్సరాలకు పూర్వం నిర్మింపబడిన ఒక ఇంటిని కను గొన్నారు. ఇది ప్రపంచంలోనే అతి పురా తనమైన కట్టడం అని అంటున్నారు.

"పరాజయం పొందినప్పుడు విజయవంతంగా లేవడమే పరువు ప్రతిష్ఠలు."

సాధారణంగా పెట్టెల్లోనే ఒకదాని కొకటి రాసుకుని మండిపోయేవి. దానివల్ల అనేక అపాయాలు, ప్రమాదాలు సంభవించేవి. అంతే గాకుండా అగ్గిపుల్లలకు పచ్చ భాస్వరం ఉపయోగించేవారు. ఇది ఒక బ్రహ్మాండమైన విషపదార్థం.



నిరపాయకరమైన అగ్గిపుల్లలను తయారు చేయవలసిన అవసరం ఎంతైనా కలిగింది. 1827 వ సం. లో స్టాక్ హోమ్ - ఆన్ - టీస్‌లో జాన్‌వాకర్ అనే రసాయనిక శాస్త్రజ్ఞుడు ప్రప్రథమంగా రాపిడి అగ్గిపుల్లలను తయారుచేసాడు. ఈ అగ్గిపుల్లలకు చివర రాసాయనిక పదార్థాల మందు మిశ్రమం అంటించబడి ఉండేది. 1844 వ సం. లో స్వీడెన్ స్టాక్ హోమ్‌లో రాయల్ కెరొలీన్ ఇన్‌స్టిట్యూట్ ప్రొఫెసర్ జి. ఇ. పాశ్చ అప్పటికి అగ్గిపుల్లలమందు తయారీలో ఉపయోగిస్తున్న అపాయకరమైన పచ్చ భాస్వరానికి బదులు ఎర్ర భాస్వరం ఉపయోగిస్తే అపాయముండదనే భావనను ప్రతిపాదించాడు. ఈ నవ్యభావనవల్ల భాస్వరం ఉపయోగంతో ఏర్పడే అపాయాలూ, నష్టాలూ పరిహారం పొందాయి. అపాయంలేని అగ్గిపుల్ల (సేఫ్టీమాచ్) వాడుకలోకి వచ్చింది.

మరి 8 సంవత్సరాలకు స్వీడిష్ అగ్గిపెట్టెల పరిశ్రమకు పితామహుడు అనదగిన జె.ఇ. లుండ్ స్ట్రోమ్ (J. E. Lundstrom) ఈ పరిశ్రమను మరింత అభివృద్ధిచేసి పేటెంట్ చేసాడు. విషకరమైన పచ్చ భాస్వరానికి బదులు ఎర్ర భాస్వరం ఉపయోగించాడు. ఈ భాస్వరం అగ్గిపుల్లకు కాకుండా అగ్గిపెట్టెకు ప్రక్కగా పట్టించి అగ్గిపుల్ల మందులో ఉండే రాసాయనిక పదార్థాలను వేరు చేసాడు. దీనివల్ల అగ్గిపుల్లలు వాటంతట అవి రాసుకుని మండవు. పెట్టెప్రక్కన ప్రత్యేకంగా ఏర్పరచిన తలంమీద గీస్తేగాని మండవు. ఈ విధంగా ప్రపంచాన్ని జయించ



"సర్వవిదులగు సుజనుల సభలలోన
మౌనమే విభూషణము మూఢ మానవులకు."

కలిగిన అగ్గిపుల్ల చరిత్ర ప్రారంభమైంది.

వెంటనే జె. ఇ. లుండ్ స్ట్రార్మ్, అతని సోదరుడు కార్ల్ ఎఫ్. లుండ్ స్ట్రార్మ్ 1845వ సం.లో ఒక చిన్న కార్ఖానాలో అగ్గిపెట్టెలను



తయారుచేయడం ప్రారంభించారు. కొద్ది కాలానికే ఒక పెద్ద ఫ్యాక్టరీగా జాన్ కోపింగ్ లో ప్రారంభించారు. ఈ భవనం ఈనాడు స్వీడిష్ మాచ్ కంపెనీవారి ముఖ్య కార్యాలయంలో మాచ్ మ్యూజియంగా ఏర్పడింది

1864 వ సం.లో అలెగ్జాండర్ లాగెర్ మన్ ఆటోమాటిక్ మాచ్ మెషీనును కని పెట్టాడు. చాలామంది దీనిని అనుకరించారు. 1870_1880 సంవత్సరాల మధ్య ఒకప్పుడు కుటీర పరిశ్రమగా అభివృద్ధిపొందిన అగ్గిపెట్టెల పరిశ్రమ బృహత్ పరిశ్రమగా ఏర్ప... ఈనాడు అగ్గిపుల్లలు తయారుచేయడం, పెట్టెలు తయారు చేయడం, పెట్టెలలోకి పుల్లలు పెట్టడం మొదలైన కార్యక్రమాలన్నీ తంతట అవే ఆటోమేటిక్ మెషీన్ల మీద ...త్తి కాబడుతున్నాయి విశిష్టమైన రకం అగ్గిపుల్లలు తక్కువ ఖరీదుకి లభ్యమవుతున్నాయి. 19 వ శతాబ్దం రెండవ భాగంలో జాన్ కోపింగ్ మాచెస్ ప్రపంచం అంతా వ్యాపించాయి. ప్రపంచ ప్రశస్తిని పొందాయి. 1870_1880 సం.రంల మధ్య స్వీడెన్‌లో ఎన్నెన్నో ఫ్యాక్టరీలు బయలుదేరాయి. 1903 వ సం.లో ఆరు ఫ్యాక్టరీలు వంలీనమైన జాన్ కోపింగ్ జాయింటు కంపెనీగా స్థాపించబడింది. పదేళ్ళ తరువాత మరో ఎనిమిది ఫ్యాక్టరీలు ఏకమై మరో క్రొత్త ఫ్యాక్టరీని స్థాపించారు. 1917 వ సం.లో ఈ రెండు కంపెనీలు చేరి స్వీడిష్ మాచ్ కంపెనీగా ఏర్పడింది. ఈ కంపెనీ అగ్గిపుల్లలు చాలా విశిష్టమైనవి.

19 వ శతాబ్దం రెండవ భాగంలో సుమారు 100 సంవత్సరాలకు పూర్వం లుండ్ స్ట్రార్మ్ సోదరులు రూపొందించిన దీర్ఘ చతురస్రాకారపు పెట్టె చిన్న సొరుగు నేటికీ ఏమాత్రం మార్పుచెందలేదు. ఈనాడు ఉపయోగంలో ఉన్న అగ్గిపెట్టె ప్రపంచంలో మిక్కిలి ప్రాచీనమైనది.

(మిగతా 64 వ పేజీలో)

## మిక్కిలి చిన్న మోపెడ్

ప్రపంచంలోనే అతి చిన్న మోపెడ్ స్వీడన్‌కు చెందిన ఆండెర్స్ ఫ్రాన్సన్ నిర్మించాడు. దీని ఎత్తు 25 సెం.లు మాత్రమే. ఇది గంటకు 30 కి మీ వేగంతో పోగలదు.

"ప్రకాశవంతమైన ఆదర్శాలు, నిర్భరమైన ఉత్సాహం ఉన్నంత కాలం అపజయం లేదు. ధర్మ విరుద్ధంగా వైఫల్యానికి లొంగిపోవడమే నిజమైన అపజయం."

—జవహర్ లాల్ నెహ్రూ

# త్రిమూర్తులు

## శ్యామాశాస్త్రి

దక్షిణ భారతదేశంలో సంగీతానికి వ్యాప్తిని కలిగించిన త్రిమూర్తులలో శ్యామాశాస్త్రి రెండవవాడు. ఇతడు తంజావూరు జిల్లా తిరువారూరు గ్రామంలో 1763 వ సంవత్సరంలో జన్మించాడు. త్యాగరాజు సమకాలికుడు. ఇతడి తాత తండ్రులు ఆంధ్రదేశం కర్నూలుజిల్లా కంబం నుంచి దక్షిణాదికి వలసపోయారు (త్యాగరాజు పూర్వీకులు కూడా కంబం దగ్గర కాకర్ల నుంచి దక్షిణాదికి చేరినవారే). శంకరాచార్యుల ఆదేశంతో కాంచీపురం వచ్చి అచ్చట కామాక్షిదేవి విగ్రహానికి అర్చకత్వం వహించారు. దేశంలో శాంతిలేదు. యుద్ధాలు ప్రారంభమైనాయి. విజయనగర సామ్రాజ్యం పతనమైంది మహమ్మదీయులు దండయాత్రలు సాగించారు. కంచిని వశపరచుకున్నారు. ఆ సమయంలో శ్యామాశాస్త్రి కుటుంబంవారు కామాక్షిదేవి విగ్రహంతోపాటు అనేక గ్రామాలు తిరిగి తిరిగి తంజావూరులో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. ఆనాటి తంజావూరు పాలకులైన మహారాష్ట్ర ప్రభువులలో తులజాజీ మహారాజు ఆశ్రయంలో చేరి, శ్యామాశాస్త్రి తండ్రి విశ్వనాథశాస్త్రి రాజుగారి ఆదరాభిమానాలకు పాత్రుడై, కామాక్షి దేవాలయం కట్టించి కామాక్షమ్మను ప్రతిష్ఠ చేసారు. దేవికి నిత్యపూజలు నైవేద్యాలు వైభవోపేతంగా జరుగుతున్నాయి.



శ్యామాశాస్త్రికి 18 సం.రాలు నిండాయి. తెలుగులో, సంస్కృతంలో, అనేక శాస్త్రాలలో అపార పాండిత్యాన్ని సంపాదించాడు. చిన్ననాటి నుండి సంగీతంలో అభిరుచి ఎక్కువ. మేనమామవద్ద సంగీతాన్ని అభ్యసించాడు. తల్లిదండ్రులు ఇతనికి వేంకట సుబ్రహ్మణ్యం అని పేరు పెట్టినా శ్యామకృష్ణా అని ముద్దు పేరుతో ఇంట్లో పిలుచుకుంటూ ఉండేవారు.

(మిగతా 57 వ పేజీలో)

"సమాజంలో ఉన్నా మానసికంగా అందులో చిక్కుకోకపోతే-అది ఏకాంతమే."

# గత్రాగడంలో లాభాలు

జ్ఞాన సంపన్నుడైన ఒక వృద్ధుడు
గొలుసుకట్టుగా సిగరెట్లు కాల్చే
తన మనుమనితో—
"బాబూ! నువ్వెందుకు అంత
ఎక్కువగా సిగరెట్లు కాలుస్తావు?"
అని అడిగాడు.



"నాకు ఎంతో ఇష్టం తాతయ్యా!
అట్ల—అవి నన్ను వదలవు
నేను నా అలవాటును వదలలేకుండా ఉన్నాను.
అది ఆరోగ్యానికి అపాయమని
నాకు నమ్మకం కలుగలేదు.
ఎందరెందరో చెప్పారు ఇది మంచిదికాదని,
కాదు కాదు, అని నా మనస్సుకు తోస్తుంది.
తాతయ్యా! నిజం చెప్పు.
సిగరెట్లు త్రాగడం మంచిదని నువ్వు
అంటావా?" అని అన్నాడు యువకుడు.

ఆ వృద్ధుడు తల ఆడించాడు.
తరువాత అన్నాడు: చూడు నాయనా,
నాకు తెలుసు దీనివల్ల మూడు లాభాలు
ఉన్నాయి.
నే చెప్పేది జాగ్రత్తగా విను.
"నీ ఆస్తిని ఎవ్వరూ దొంగిలించలేరు.
జంతువులు గాని పురుగులు గాని
నీకు హాని కలిగించవు.
వృద్ధాప్యంవల్ల నీకు సమస్యలుండవు.
ఈ మూడూ కూడా నికరమైన
లాభాలు."
మనుమడు అడిగాడు:
"తాతయ్యా! ఇది తెలుసుకున్నందుకు
నాకు సంతోషం.
దయఉంచి నాకు చెప్పవూ
ఇవి సిగరెట్లు కాల్చేవారికి ఎలా లాభకరమో?"
వృద్ధుడు చెప్పాడు.
"నాయనా, నీవు రోజూ

---

## ఒక గంటలో పెరుగు!

మైసూరు (కర్ణాటక)లోని కేంద్ర ఆహార మరియు సాంకేతిక పరిశోధనా సంస్థ అతి త్వరగా ఒక గంటలో పెరుగును తయారు చేసే విధానం కనిపెట్టారు. వీరు తయారు చేసిన డ్రై మిక్స్ పొడిని పాలలో కలిపి, ఒక మజ్జిగచుక్క తోడుపెడితే మంచి కమ్మని పెరుగు ఒక గంటలోనే తయారవుతుంది.

---

"ఒక విషయాన్ని ఇద్దరు అంగీకరిస్తే
అందులో యోచనంతా ఒకరిదే అని తెలుసుకో."

ఎవ్వరూ సిగరెట్లు కాలుస్తూంటే
రాత్రంతా దగ్గుతూంటావు.
నువ్వు మెలకువగా ఉన్నప్పుడు
దొంగ ఎవ్వరూ జొరబడలేరు.
కుక్కగానీ, దోమగానీ, పురుగుగానీ
దూరంనుంచే వెనక్కు పోతాయి.
పొగ తాగేవారి రక్తం
జంతువులకూ, పురుగులకూ ఎంతో విషకరం.
అవి ఎలా నీ దగ్గరకు రాగలవు?
పొగత్రాగే వాళ్లు శీఘ్రంగా
మరణిస్తారు, చాలా శీఘ్రంగా,
ఆ విధంగా అసలు
వృద్ధాప్యపు సమస్య లుండవు.
ఇప్పుడు బాగా తెలిసిందా?"
యువకుడు ఆ వృద్ధుని బోధ
విని ఆలోచించాడు.
"ఇప్పటి కిప్పుడే పొగ త్రాగడానికి స్వస్తి
చెబుతాను,
దగ్గుతూ రాత్రంతా మేలుకుని
నేను బాధపడలేను.
నా శరీరంలో రక్తం విషపూరితం
కావడం నాకు ఇష్టంలేదు.
గ్యంగా నాలుగు కాలాలపాటు
జీవించనీ."
అని నిర్ణయించుకుని
మనసారా తాతయ్యకు సాష్టాంగ
ప్రణామం చేసాడు.

—ఎస్. స్వామినాథన్
'లైఫ్ నాచురల్' సౌజన్యంతో.

## భారతదేశంలో ప్రతి సంవత్సరం 2 లక్షల రోడ్డు ప్రమాదాలు జరుగుతున్నాయి



నేషనల్ ట్రాన్స్‌పోర్టేషన్ ప్లానింగ్ మరియు రీసెర్చి సెంటరు (NATPAC) వారు సర్వే జరిపి భారత దేశంలో ప్రతీ నాలుగేసి నిమిషాలకు ఒక ప్రమాదం జరుగుతూందని, దాని వల్ల ఒక్కరు మరణించడం గాని, తీవ్రంగా గాయ పడడం గాని జరుగుతూందని తేల్చారు. సాలీనా దేశంలో 2,00,000 ప్రమాదాలు జరుగుతున్నాయి. సగటున 0 శాతం వాహనాలు ప్రమాదానికి గురి అవుతున్నాయి. ఈ ప్రమాదాల వల్ల 25,000 మంది మర ణించగా ఒక లక్ష మంది గాయ పడు తున్నారు. వీటి వల్ల కలిగే ఆర్థిక నష్టం రూ. 350 కోట్లకు పైబడే ఉంటుందని అంచనా.

"అవసరమైన వాటి కంటే అధికంగా
పన్నులు వసూలు చేయడం చట్టబద్ధమైన దోపిడి." —కాల్‌విన్ కూలిడ్జి

# అవీ - ఇవీ

## ఇథియోపియాలో తీవ్రమైన కరువు:

గత పది సంవత్సరాలుగా ఇథియోపియాలో కరువు ఏర్పడింది. ఈ సంవత్సరం ఇది మరింత తీవ్రంగా పరిణమించింది.



ఒంటెలు కూడా మరణిస్తున్నాయి. 50 లక్షలకు పైగా జనం కరువు బాధకు లోనయ్యారు. మొత్తం కరువుబాధకు గురైన జనాబాలో 45 శాతం 15 సం.ల వయస్సు లోపు పిల్లలు.

## ప్లాట్‌ఫారం టిక్కట్ల అమ్మకానికి తొలి ఎలక్ట్రానిక్ మెషీను:

భారతదేశంలో తిరువనంతపురం రైల్వే స్టేషనులో ప్లాట్‌ఫారం టిక్కట్ల అమ్మకానికి ప్రప్రథమంగా ఎలక్ట్రానిక్ మెషిన్ ఏర్పాటు చేసారు. కేరళ రాష్ట్రం ఎలక్ట్రానిక్స్ డెవలప్‌మెంట్ కార్పరేషన్ వారిచే అభివృద్ధి కావింపబడిన ఈ మెషిను వెంటనే మీ ముందే ప్లాట్‌ఫారం టిక్కట్లు అచ్చువేసి ఇస్తుంది. ప్రతీ టిక్కట్టు మీద తేదీ, సరి అయిన కాలం, చార్జి, వరుస నంబరు మరియు సెక్యూరిటీ కోడు వుంటాయి.

* * *

## టిక్కట్టులేని ప్రయాణీకుల నుండి రూ. 3 37 లక్షల వసూలు:

టిక్కెట్టులేకుండా ప్రయాణంచేసే ప్రయాణీకుల సంఖ్య 1983-84లో 40,000 నుండి, 1984-85 మొదటి తొమ్మిది నెలలకు 32,000 వేలకు తగ్గింది. వారివద్దనుండి 1983-84 సం. లో రూ. 38 లక్షలు వసూలు చేసారు. 1984-85 సం లో రూ. 3.37 లక్షలు వసూలు అయింది. వీరి మీద విధింపబడిన పెనాల్టీ 1983-84 లో రూ.

## సౌది అరేబియాకు అమెరికా ఇసుక!

సౌది అరేబియాలో నీటిని వడకట్టి శుభ్రం చేసుకోడానికి అమెరికా న్యూజెర్సీ నుండి ఇసుకను దిగుమతి చేసుకుంటూంది. అరేబియా దేశమంతా ఇసుకమయం కాని, ఇది నీటి వడపోతకు పనికిరాదుట.

"నీతిమంతులు ధన లోభంతో గౌరవాన్ని భంగపరచుకోరు."

3.73 లక్షలు, 1984-85 లో రూ. 3.09 లక్షలు

• • •

క్రొత్తపానీయం:

కార్నాల్ (హర్యానా)లో జాతీయ పాలు పరిశోధక సంస్థ (National Dairy Research Institute) వారు ప్రవృద్ధి చేసిన క్రొత్త 'ఆసిడోవ్హే' (Acidowhey) అతి త్వరలో ప్రసిద్ధి పొందిన కమ్మని పానీయంగా తయారవుతుంది. పాలను వెన్నగా తయారుచేసేటప్పుడు మిగిలిపోయిన (విటమినులు, ఖనిజాలు, పంచదార, కార్బొహైడ్రేట్లు కలిగిన) ఆకు పచ్చని ద్రవం నుంచి దీనిని తయారు చేస్తారు.

• • •

900 పౌండ్ల రొట్టె:

హై గేట్ (వెర్మాంట్ - అమెరికా) ప్రదర్శనకి హెలికాప్టర్ మీద తెచ్చిన 900 పౌండ్ల పెద్ద రొట్టెను 200 మంది ఆప్యాయంగా తిన్నారు. లెక్కకడితే ఒక్కొక్కరు 4½ పౌండ్ల రొట్టెను తిని ఉండాలి.

• • •

ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీషు నిఘంటువును కంప్యూటరైజు చేస్తారు:

21,000 పేజీలతో 16 సంపుటాలు గల ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీషు డిక్షనరీ అతి త్వరలో అమెరికా కంప్యూటర్ ఇండస్ట్రీవారి 70 లక్షల పౌండ్ల ద్రవ్య సహాయంతో కంప్యూటరైజ్ కావించబడుతుంది.

ఒకే సమంగా రెండు అగ్నిపర్వతాలు అంటుకున్నాయి:

పసిఫిక్ మహా సముద్రంలో హవాయి ద్వీపాలలో మౌనాలోవా (Mauna - loa), కిలాకీ (Kilakea) అనే రెండు అగ్ని పర్వతాలు 116సం. లో తొలిసారిగా ఒకేసారి అంటుకున్నాయి.

• • •

(మిగతా 55 వ పేజీలో)

## ఆంగ్లంలో జాబువాసిన ప్రథమ ఆంగ్లేయ మహిళ



జోన్ పెల్‌హామ్ ఆంగ్లభాషలో జాబు వ్రాసిన తొలి ఆంగ్లేయ మహిళ. తన భర్తకు జూలై 25, 1399 న ఈ జాబును వ్రాసింది. అంతకు ముందు ఆంగ్లేయ మహిళలు ఫ్రెంచి భాషలోనే జాబులు వ్రాసుకునేవారు.

"నిరుత్సాహం సర్వ విజయ నిర్మూలన హేతువు."

# అసూయ పెను

సర్వసామాన్యంగా మానవులందరినీ పట్టుకు పీడించే మహామారి అసూయ. 'పచ్చకళ్ళ పెనుభూతం' అని వర్ణించాడు సుప్రసిద్ధ ఆంగ్లేయ మహాకవి షేక్స్పియర్. ఈ



మహోపద్రవమైన రోగాన్ని కుదుర్చుకుంటే గాని మనస్సుకి శాంతి ఉండదు. అసూయ ఎంత అల్ప ప్రమాణంలో ఉన్నా హాలాహల విషంలా పరిణమిస్తుంది. కరుణామూర్తులు పుణ్యవంతులు. అసూయాపరులు పాపాత్ములు.

అసూయపడడం వల్ల ఏ సమస్యాకూడా పరిష్కారం అవదు. కాగా మరింత క్లిష్టతరం అవుతుంది. అసూయా భావాలు మనస్సులో అంకురించి ప్రవృద్ధి పొంది సర్వనాశనాన్ని కలిగించినట్లు అనేక కథలనుబట్టి, చరిత్రలనుబట్టి తెలుసుకుంటున్నాం. అసూయ వలన ఎట్టి పరిస్థితులలోను ఎదుర్కోలేనంతటి మనో దౌర్బల్యం ఏర్పడుతుంది. అసూయ సర్వనాశనానికి హేతువు.

అసూయ ఎలా ఉద్భవిస్తుంది? అసమాన భావ బీజాలవల్ల అసూయ అంకురిస్తుంది. ఒకరికి ఉన్నదిగాని, ఉన్నంతగాని సీకు లేకపోవచ్చు. తక్కువగా ఉండవచ్చు. అప్పుడు నీకు ఉన్నవాళ్ళను చూస్తే అసూయ పుడుతుంది. ఒకరు మంచి శరీరచ్ఛాయతో సొగసుగా ఉండవచ్చు, ధనవంతులుగా ఉండవచ్చు, సమాజంలో అధిక గౌరవం కలవారు కావచ్చు, నలుగురిలో బాగా ప్రసిద్ధిని పొందినవారు కావచ్చు, మంచి విద్యావంతులు కావచ్చు. అసమత్వభావన అన్యాయానికీ, అధర్మానికీ దారి తీస్తుంది. అసమానతలు సహజంగా ఏర్పడ్డవే. వారితో సమంగా లేము అనే అసమత్వ భావాన్ని పూర్తిగా పోగొట్టుకోవాలి. అప్పుడు అన్యాయం, అధర్మం అనే

---

## సెమి కండక్టర్ స్టోరేజి చిప్

ఒక చతురం మిల్లీమీటరుకు 10,000 ట్రాన్సిస్టర్లు అమర్చబడిన సెమికండక్టర్ స్టోరేజి చిప్‌ను సీమెన్స్ కంపెనీ క్రొత్తగా మార్కెట్‌లో ప్రవేశపెడుతున్నారు. మొత్తం 320,000 ట్రాన్సిస్టర్లు, 260,000 ఇతర విడిభాగాలు గల ఈ చిప్‌లో 262, 144 సమాచారాల (బిట్స్) ను భద్రపరచవచ్చు. మామూలుగా 16 పేజీల టైపుచేసిన సమాచారాన్ని ఒక చిన్న చిప్‌లో భద్రపరచవచ్చు.

ప్రశ్నరాదు. అసమానతలో- ప్రకృతికి ఆనందం. అందుచేతే జీవితంలో 'వైవిధ్యం విలాసం'. నీ చేతి ఐదువేళ్ళను ఒక్కసారి చూచుకో. ఒకదానితో ఒకటి సమానంగా ఉండదు. ఐనా ఒక వ్రేలు మరో వ్రేలును చూచి అసూయ చెందదు. శరీర వర్ణాలను చూచి అసూయ పొందడం ఎందుకు? నలుపులో నాణ్యత ఉంది. శ్రీకృష్ణుడు నల్లటి నలుపు. చిన్నవాళ్ళు, పెద్దవాళ్ళు ఆడవాళ్ళు, మగవాళ్ళు అందరూ ఆబాలగోపాలం శ్రీకృష్ణుని చూసి మోహించినవాళ్ళే. మానవాళికం వలచిన ప్రేమమూర్తి.

సోక్రటీస్ చప్పిడి ముక్కుతో మరుగుజ్జు, కురూపి. హేమాహేమీలు పండితు లెందరో అతని కాళ్ళముందు కూర్చున్నారు. అందవికారిగా ఉండే అబ్రహాం లింకన్ అమెరికా ఐక్యతను సాధించిన మహానీయుడు. అతనిని ప్రపంచం పొగిడింది. హోమర్ గ్రుడ్డి. మిల్టన్‌కి కళ్ళులేవు. సాహిత్య రంగంలో వీరిని మించిన కవులు లేరు.

ధన హీనత వల్ల కీర్తికి హాని సంభవించదు. క్రీస్తు, బుద్ధుడు, గాంధీమహాత్ముడు చేత గ్రుడ్డి గవ్వలేని దరిద్ర నారాయణులు. వీరే ప్రపంచానికి మేలు చేసిన మహాత్ములు. శ్రీరామకృష్ణుడు, శారదా దేవి నిరక్షర కుక్షులు. వారు పలికిన పలుకులు అమృత తుల్యములు; అతి గంభీరమైనవి. కాబట్టి నీకు లేని ఇంకొకరికి ఉందని అసూయపడవద్దు. పరమేశ్వరుడు నీకు ప్రసాదించిన దానిని ఉత్తమ రీతిగా వినియోగించుకో. మనస్సు పరిపక్వం పొంది విశిష్టమైన దానికోసం ఉదకి మిస్తూంటే అసూయ పొందడానికి అవకాశం ఏర్పడదు. అసూయ ఋణభావం. మనస్సులో ధన భావాలను ప్రవృద్ధి పరచుకుంటే అసూయను అతి సులభంగా పోగొట్టుకోవచ్చు, యోగ్యమైన ఉన్నతాశయాలను కలిగి ఉండటమే అభివృద్ధికి మంచి మార్గం.

('వేదాంత' సౌజన్యంతో)

## గుండె ఆకారంలో పెద్ద వజ్రం



ఈమధ్య లండన్ గ్రాఫ్స్ స్టోర్‌లో అమ్మజూపిన 60 వజ్రాలు పొదిగిన నెక్లెసులో విశేషమైన 70.03 కారట్లు బరువుతో 70 లక్షల డాలర్లు విలువచేసే గుండె ఆకారంలో వజ్రం ఒకటుంది. ఒకటి మొదలు 10 కారట్లు భారముండే 48 వజ్రాలతోపాటు ఇది కూడా అందులోనే పొదగబడింది. దీని మొత్తం విలువ 160 లక్షల డాలర్లు!

"సత్య సంధులు, స్వాతంత్ర్య యోధులు
మాత్రమే సంఘ నాయకులు." —హెన్రిక్ ఇబ్ సెన్

# జీవితం నేర్పిన పాఠాలు

## ఎమ్. పి. పండిట్



[పాండిచ్చేరిలో ఇంటర్ స్పిరిచ్యువల్ ఫెలో షిప్ మరియు ప్రాజెక్ట్ యూనివర్సల్ మాన్ సంస్థ స్థాపకులు శ్రీ ఎమ్. పి. పండిట్ ప్రస్తుతం శ్రీ అరవిందాశ్రమం సెక్రటరీగా ఉంటున్నారు. వీరు గొప్ప రచయిత. యోగం, వేదాంతం, సంస్కృతి, రాజకీయం మొదలగు విషయాల ఎన్నిటినో సంకలనం చేసారు. అనువాదాలు కావించారు.]

వ్యక్తిగతంగా ఎవరి జీవితాలు వారికి పాఠాలు నేర్పుతాయి. అందరూ వాటిని నేర్చుకోరు. నేర్చుకున్న పాఠాలూ ఉంటాయి; నేర్చుకోని పాఠాలూ ఉంటాయి. పొందిన అనుభవాలలో కష్టాలను మాత్రం జ్ఞాపకం పెట్టుకుంటారు. విచారిస్తారు, మొరపెట్టు

## మీరైతే...?

(జూలై 1986)

(వైష్ణవ గుళ్ళలో తీర్థప్రసాదాలు లేవంటే?)

"బ్లాకులో దొరుకుతుందేమో చూడండి, టిక్కెట్టు పెట్టి కొంటాను."

—ఎన్. రాజశేఖర్, ఇల్లెందు, (ఖమ్మం జిల్లా)

* * *

"నిలువు నామాలను అడ్డంగా దిద్ది శివాలయానికి వెళ్తా."

—కె. కనకదుర్గ, ఆత్మకూరు, (కర్నూలు జిల్లా)

* * *

"శివః శివా! ............"

—పిట్టల చలపతిరావు, మన్న, (కృష్ణా జిల్లా)

"అధిక మధురమైన యాత్ర ఫలము
అయోగ్యమని రాయి వెవ్వడు తినును."

కుంటారు. అసలు గుణపాఠాలు మరచి పోతారు.

ప్రపంచంలో అనుబంధాలు, బాంధవ్యాలు స్థిరంకావు కలకాలం కలిసి ఉంటాం అనుకుని ప్రారంభించిన స్నేహాలు ఇట్టే విడిపోతాయి. అలాగే వైరాలు, వైషమ్యాలు చిర్లకాలం ఉండిపోవు. చిరకాలంనుంచీ ఉన్న స్నేహ బాంధవ్యాలు కలతలతోనే ప్రారంభమవు తాయి. "ఈనాటి విరోధి ఎప్పుడో ఒకరోజు ఆప్త స్నేహితుడుగా మారడానికి, ఇప్పటి ఆప్తమిత్రుడు విరోధిగా మారడానికి అవకాశ ముంది." అనే చైనా సామెతను మనం అర్థం చేసుకోవాలి.

నీ మీద ఇతరులకుండే విశ్వాసాన్ని గౌరవించు. వారి రహస్యాలను ఎప్పుడూ బయటపెట్టకుండా ఉండడం నేర్చుకో. పరుల గుట్టును రట్టు చేయడానికి ప్రయత్నించకు. అతడూ నీ రహస్యాలను ప్రకటించగలడు. అప్పుడు నీవు చేయగలిగింది లేదు. అనుభ వించి తీరాల్సిందే. మీరు ఒకరి రహస్యాన్ని గూఢంగా ఉంచలేనప్పుడు వారు మీ రహస్యా లను గుప్తంగా ఉంచగలరని అనుకోవద్దు.

ఎన్నడూ స్నేహితులకు, బంధువులకు అప్పులు ఇవ్వవద్దు. ముఖ్యంగా బంధువులకు సొమ్ము అప్పుగా ఇవ్వవద్దు. పుచ్చుకునే టప్పుడు ఎంతో అభిమానంతో, ఆప్యాయంగా మాట్లాడి పుచ్చుకున్నా తిరిగి ఇచ్చేటప్పుడు వెనుకంజ వేస్తారు. జ్ఞాపకం చేసామంటే మనస్తాపాలు, విరోధాలు ప్రారంభమై, బంధు త్వాలు దూరమవుతాయి. ఇవ్వగలిగే స్తోమత ఉంటే ఇవ్వదలచినది బహుమానంగా ఇవ్వ డం ఉత్తమోత్తమం. అప్పుగా మాత్రం సొమ్ము ఎప్పుడూ ఇవ్వవద్దు నీవు చెప్పేదే, నీవు వాదించేదే నిజం, న్యాయం అనుకోకు. అది సమంజసం కాదు. ఇతరులు చెప్పేవీ న్యాయంగానే ఉంటాయి. నీదే న్యాయ మైనదని తోచినప్పుడు కూడా ఉద్రేకంతో

(మిగతా 49 వ పేజీలో)

## మావో ట్సే-టుంగ్ పై పదవికి అనర్హుడట!



సుప్రసిద్ధ చైనా నాయకుడు మావో ట్సే-టుంగ్ ఇప్పుడు బీజింగ్‌లో ఉన్న పెకింగ్ యూనివర్సిటీ లైబ్రేరియన్‌కు 1918 లో అసిస్టెంటుగా పని చేసాడు. అప్పుడు ఉద్యోగరీత్యా పై పదవికి అతనికి అర్హత లేదన్నాడు.

"చేరిక ప్రారంభ దశ, చేరి కొనసాగించడం ప్రగతి, చేరి ఉమ్మడిగా కృషి చేయడం విజయం."— హెన్రీ ఫోర్డ్

# క్రీడలు - వినోదాలు

## బాస్కెట్ బాల్

ఎత్తుగా అమర్చిన వలలో బంతిని వేసి గోల్సు స్కోరు చేసుకునే ఆట బాస్కెట్ బాలు. ప్రప్రథమంగా వలకు బదులు ఒక బుట్ట (basket) ను వాడేవారు. అమెరికాలో



మసాచుసెట్స్ స్ప్రింగ్ ఫీల్డ్ లో 1891 వ సం. లో ఇది ప్రారంభమైంది వినోదవంతమైన ఈ క్రీడను ప్రారంభించిన మహాశయుడు కెనడాకు చెందిన డా. జేమ్సు నెయస్మిత్ (Dr. James Naismith), స్ప్రింగ్ ఫీల్డ్ లో యంగ్ మెన్స్ క్రిస్టియన్ అసోసియేషన్ ట్రెయినింగ్ స్కూలు ఫిజికల్ ఎడ్యుకేషన్ డిపార్టుమెంటు హెడ్ డా. లూథర్ గలిక్ (Dr. Luther Gulick) వ్యాయామంలో మానవ శరీరాభివృద్ధి నిర్మాణానికి అనువుగా ఉండే ఒక క్రీడ అవసరమని అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

ఆ స్కూలులో అధ్యాపకుడుగా ఉన్న నెయస్మిత్ దీనికి పూనుకుని జిమ్నేషియం (gymnasium) లో ఈ చివర ఆ చివర స్టెప్ లాడర్లు (Step ladders) పెట్టి వాటిపైన ఒక్కొక్క బుట్ట ఏర్పాటు చేసి మధ్యమందుని కాలి బంతి (soccer ball) ని ఒక బుట్టలోకి విసిరాడు. తరువాత ఈ బుట్టలకు

## ప్రపంచంలో మిక్కిలి చేదైన పదార్థం

న్యూయార్క్ (అమెరికా) ప్లెయిన్ వ్యూలో రసాయనిక శాస్త్రజ్ఞులు ప్రపంచంలోనే మిక్కిలి చేదైన పదార్థాన్ని కని పెట్టారు. క్వినైన్ (Quinine) కంటె కూడా 3,000 రెట్లు చేదుగా ఉండే ఈ తెల్లటి పొడిని డెనటోనియమ్ సాకరైడ్ (denatonium saccharide) అంటారు. ఒక వంతుకు 100 మిలియను వంతులు నీళ్ళు కలిపినా దీని చేదు పోదు.

"తారలెన్ని యున్నను చంద్రుడున్న గదా రాత్రి వెలుగొందు."

రంధ్రాలు అమర్చాడు. ఈ రంధ్రం ద్వారా బంతి క్రింద పడుతుంది. రాను రాను ఈ



బుట్టకు బదులు హామ్మక్ స్టైలు బుటను (hammock style basket) ఏర్పాటు చేశారు. మెల్లి మెల్లిగా ఈ ఆటను వృద్ధిపరచి దీనికి సంబంధించిన 13 నిబంధనలను నెయ్ స్మిత్ ఏర్పరచి క్లాస్ గదిలో ఆటను ప్రారంభించాడు క్లాసులో ఆ నాడు ఉన్న 18 మంది విద్యార్థులను చెరో ప్రక్క తొమ్మిదేసిమందిని జట్టుగా నిలబెట్టాడు. ఒక్కొక్క జట్టుకు 3 మొదలు 40 మంది ఆటగాళ్ళు ఉండవచ్చుని ఈ ఆట మొదటి నిబంధన. రెండు సంవత్స రాల అనంతరం ఒక్కొక్క జట్టుకు 5 గురు ఆటగాళ్ళు ఉండడం ఉత్తమం అని నిర్ణయించారు.

ఆట మొట్టమొదట ప్రారంభించిన నాటి నుండి అమెరికాలో శాస్త్రయుక్తంగా ఒక్కొక్క టీములో 5 గురు చొప్పున ఈ ఆట బాగా ప్రచారంలోకి వచ్చింది. క్రమేపీ అన్ని కాలేజీలలోనూ, హైస్కూళ్ళలోనూ, ఫిజికల్ ట్రయినింగ్‌లోనూ ముఖ్యమైన ఆటగా పరిణమించింది 1932 సం.లో నిర్వహింపబడిన ఒలింపిక్ క్రీడలలో బాస్కెట్ బాల్ ఆట ప్రత్యక్షంగా ప్రదర్శింపబడింది. తరువాత నాలుగు సంవత్సరాలలో దీనిని ఒలింపిక్ ఆటగా అంగీకరించారు. మొట్టమొదట అమెరికా జట్టు ఒలింపిక్ క్రీడలలో విజయాన్ని పొంది బంగారు పతకాన్ని గెలుచుకుంది ఆ నాటి నుండి ఎన్నెన్నో పతకాలను సంపాదించుకుంది.

బాస్కెట్ బాల్ కోర్టు దీర్ఘ చతురస్రాకారంలో ఉంటుంది. రెండు ప్రక్కల ఎత్తుగా చెరో స్థంభానికి ఒక పెద్ద రంధ్రం గల వల తగిలిస్తారు. ఈ వల అంచు ఆట ఆడే స్థలం నుంచి 3 మీటర్ల ఎత్తుగా ఉంటుంది. ఒక టీములో ఉన్న ఆటగాళ్ళు బంతిని ఎదురు ప్రక్క ఉండే వలలోకి వేయడానికి ప్రయత్నిస్తారు. వలలో పడితే పాయింట్లను గెలుచుకుంటారు. ఈ సమయంలో ఎదుటి పార్టీ వాళ్ళు బంతిని వలలో పడనీయ

---

## 96,338 గ్రామాలలో తపాలా సౌకర్యాలు లేవు

ఉత్తర ప్రదేశ్‌లో 96,338 గ్రామాలలో అసలు పోస్టాఫీసులే లేవు కర్ణాటక, ఆంధ్ర ప్రదేశ్, తమిళనాడు రాష్ట్రాలలో వరుసగా 8,571, 12,551 మరియు 6,012 గ్రామాలలో పోస్టాఫీసులు లేవు. ఒక్క కేరళలో మాత్రమే ప్రతీ గ్రామానికి ఒక పోస్టాఫీసు ఉంది.

"పరిసరావరణములకు అనుకూలంగా మారుచే ప్రాణి లక్షణం."

కుండా పట్టుకోడానికి ప్రయత్నిస్తారు.

ఒక్కొక్క టీముకు 5 గురు ఆటగాళ్ళే ఉండాలి. బాస్కెట్ బాల్ అతి వేగంగా నైపుణ్యంగా ఆడగలిగే ఆట. బంతిని ఎత్తుగా ఉండే వలలోకి వేయడం ముఖ్యం కాబట్టి ఈ ఆటకు బాగా పొడవైన వాళ్ళనే ఎన్నుకుంటారు.

నైస్మిత్ ప్రారంభించిన ఈ ఆట విధానం అంతగా మార్పు చెందకపోయినా దీనికి సంబంధించిన నిబంధనలు మాత్రం ఆటగాళ్ళ నైపుణ్యాభివృద్ధికి అనుగుణంగా చాలా మార్పులు చేయబడ్డాయి.

మొట్టమొదట ఆటలో వాసవంగా కోర్టులో ఆటగాళ్ళు ఏం చేస్తున్నారో వాళ్ళే తెలియక కాబోలు 1-0 తో గెలుపొందారు: కోర్టులో ఆటగాళ్ళు గుంపుగా మూగేవారు కూడా. కాని 1960 సం. లో ఫిలడల్ఫియా వారియర్స్ టీముకు చెందిన విల్ట్ చాంబర్లిన్ (Wilt Chamberlain ఒక్క ఆటలో 100 పాయింట్లను గెలుచుకో గలిగాడు.

మొట్టమొదట కెనడాకు, ఆ తరువాత 1900 సం. రానికి ముందే ఫ్రాన్స్. జపాను, చైనా, బ్రెజిల్, బ్రిటను, ఇండియాకు ఈ ఆట ప్రాకిపోయింది. స్ప్రింగ్ ఫీల్డ్ ఆటల్లో పాల్గొన్న మెల్. బి. రైడౌట్ (Mel. B. Rideout) ద్వారా యూరపులో ఈ ఆట మిక్కిలి ప్రచారం పొందింది. ఈ నాడు తూర్పు యూరపు, రష్యాలలో కూడా మిక్కిలి ప్రసస్తిని పొందిన ఆట బాస్కెట్ బాల్.

దక్షిణ అమెరికాలో బ్రెజిల్, అర్జెంటీనా, ఉరుగ్వే టీములు మంచి బలవంతమైనవి. అమెరికాలో ఈ ఆటనే ఒక వృత్తిగా పెట్టుకున్న నీగ్రో జాతికి చెందిన హార్లెమ్ గ్లోబ్ ట్రాటర్స్ (Harlem Globetrotters) అంతర్జాతీయంగా ఈ ఆటను బాగా ప్రచారం చేశారు. ప్రతీ సంవత్సరం 20 లక్షల మంది పైబడిన ప్రేక్షకుల ముందు ఈ ఆటను వీరు ఎంతో ఉత్సాహంగా ఆడతారు.

ఈ ఆట బహుళ ప్రచారానికి అతి వేగంగా బంతి జరుగుతూండడమే కారణం. క్రొత్త నిబంధనల ప్రకారం బంతి ఆగకుండా నిరంతరం కదులుతూనే ఉండాలి. శారీరక బలంతోపాటు నైపుణ్యం ఈ ఆటకు ముఖ్యంగా అవసరం. కాలి వేగం, మంచి చూపు, హస్తలాఘవం చాలా ముఖ్యం.

## వజ్రాలలో ఉండే దోషాలవల్లే వివిధ వర్ణాలు



వజ్రాలలో వివిధ రూపాలు, వర్ణాలు కూడా వాటిలో ఉండే దోషాలవల్లే ఏర్పడతాయి వీటిలో ఉండే నత్రజని సంబంధమైన దోషాలనుబట్టే వీటి వర్గీకరణ జరుగుతుంది.

# సుఖనిద్రకు మార్గా

టి. ఆర్. సేతురామన్

నిద్ర సకల ప్రాణులకు ప్రకృతి ప్రసాదించిన అపూర్వ కానుక. అందులోనూ మానవులకు ఇది మిక్కిలి అమూల్యమైనది. బాహ్య



పరిస్థితులను తాత్కాలికంగా విస్మరించి ఒళ్ళు తెలియకుండా పొందే మానసిక, శారీరక విశ్రాంతే నిద్ర. పగటిపూట మానవులు వ్యక్తిగతంగా వారి వారి పనులను బట్టీ, అలవాటును బట్టీ ఈ నిద్ర మోతాదు మనిషి మనిషికీ మారుతుంది.

నిద్రావస్థలో మనం అప్పుడప్పుడు కాళ్ళు చేతులు కదుపుతాం. ఈ ప్రక్కకు ఆ ప్రక్కకు దొర్లుతాం. ఇది నిద్రపోయే వారందరికీ సహజం. తప్ప త్రాగినవాళ్ళు మాత్రం కదలకుండా పడుకుంటారు.

సహజంగా మానవులందరికీ రాత్రి పూట 8 గంటలసేపు గాఢనిద్ర అవసరం. కాని కొంతమంది ఏ నాలుగైదు గంటలసేపో నిద్రపోయినా 8 గంటల కాలం నిద్రపోయిన వారి కంటె ఎక్కువ ఉత్సాహంగానూ, హాయిగానూ కనిపిస్తారు. ముఖ్యంగా ఇటీవల పెద్ద పెద్ద పట్టణాలలో ధనవంతుల కుటుంబాలలో నిద్ర పట్టకపోవడం (ఇన్‌సోమ్నియా) ఎక్కువగా కనిపిస్తూంది. వైద్యులు ఇచ్చే నానా రకాల నిద్ర మాత్రలు, కెమిస్టులు అమ్మే నిద్రమందుల వల్లే ఇది తెలుస్తూంది. ఒక్కొక్కప్పుడు మించిన మోతాదులో ఈ నిద్ర మాత్రలు తీసుకుని ప్రాణాపాయాన్ని తెచ్చి

---

## ప్రపంచంలో మిక్కిలి ఎక్కువ వార్తాపత్రికల పఠనం

అమెరికాలో 1,730 పైగా ఆంగ్ల దినపత్రికలు ఉన్నాయి. వీటి సర్క్యులేషను రోజుకి 6,14,30,745 కాపీలు. ప్రపంచంలో స్వీడన్ (వాయవ్య యూరపు) ప్రజలు ఎక్కువగా వార్తా పత్రికలు చదువుతారు. స్వీడన్‌లో ప్రతి 1000 మందికి 554 పత్రికల అమ్మకం జరుగుతూంది.

"కలిమిగలవారి చెలిమిచే కలిమి సొంపొందునట్లు భగవంతుని దివ్య చరణ సేవావ్రతులైన సమతుల సంగముచేతనే భక్తి జనించి పెంపొందును."

పెట్టుకున్నవారిని కూడా చూస్తున్నాం. నిద్ర లేకపోవడం వల్ల మానసికంగా శారీరకంగా విశ్రాంతి లోపిస్తుంది. దాని ఫలితంగా పగటి పూట చేసుకోవలసిన పనులకు అంతరాయం కలుగుతుంది. చికాకు ఏర్పడుతుంది. నిద్ర లేకపోవడం నిజంగా అనర్థదాయకం. శారీరక, మానసిక ఆరోగ్యం దృష్ట్యా అది మంచిది కాదు.



శక్తికి మించిన పని చేయడం, ఉద్రేకం, ఆందోళన, తీవ్ర ద్వేషం, ఎక్కువగా మద్యం త్రాగడం వల్ల ఏర్పడిన మానసిక బిగువు (tension) నిద్ర లేమికి ముఖ్య కారణాలు. అజీర్ణ బాధ, మితిమీరిన విందులు ఆరగించడం, మలబద్ధత, కాఫీ, టీలు ఎక్కువగా త్రాగడం, రాత్రి ఏమీ తినకుండా ఖాళీ కడుపుతో పడుకోడం, సిగరెట్లు ఎక్కువగా కాల్చడం వల్ల కూడా ఇది కలుగుతుంది.

బలవంతంగా నిద్ర పట్టించుకోడానికి నిద్ర మాత్రలు సేవించడం ఇన్‌సోమ్నియాకు వైద్యం కాదు. ఒకసారి నిద్ర మాత్రలు తీసుకుంటే మళ్ళీ మళ్ళీ వాటిని తీసుకోవాలని అనిపిస్తుంది. అది ఒక అలవాటుగా పరిణమిస్తుంది. ఆ తరువాత ఎన్ని మాత్రలు తీసుకున్నా అవి పని చేయవు. నిద్ర మాత్రలు పుచ్చుకోవడంవల్ల అనేక ఇతర బాధలు, అనర్థాలు ఏర్పడతాయి. ఆల్కహాలు మొదలైన మద్యాలు త్రాగే ముందుగాని, తాగిన తరువాత గాని వీటిని తీసుకోవడం చాలా అపాయకరం. నరాల ఉద్రేకాన్ని తగ్గించే సెడెటివులు, ట్రాన్‌క్విలైజర్స్ (sedatives, tran-quilisers) ఉపయోగించడంకూడా మంచిది కాదు.

ప్రతి రోజూ రాత్రి నియమంగా వేళకు పడుకోవడం పెందరాడే లేవడం అలవాటు చేసుకోవాలి. ఎప్పుడో అర్ధ రాత్రి తరువాత చాలాసేపు పడుకోడం కంటే అర్ధ రాత్రికి ముందు పడుకోడం ఆరోగ్యకరం. సాధారణంగా విద్యార్థులు పరీక్షల ముందు రాత్రి చాలాసేపు చదివి మరునాడు పరీక్షకు వెళ

## పెద్ద పెద్ద నగరాలలో రోజుకి 500 టన్నుల చెత్త

ప్రస్తుతం ఇండియాలో 142 పెద్ద నగరాలలో రోజుకి 90,000 లక్షల లీటర్ల మురుగు నీరు చేరుతూంది. 10 లక్షలు దానికిపైన జనాభా ఉండే నగరాలలో రోజుకు 500 టన్నుల చెత్తకుప్ప పేరుకుపోతూంది. దీని వల్ల చెరువుల నీరు, నదుల నీరు, భూగర్భ జలాలు కూడా కాలుష్యం చెందుతున్నాయి.

"అన్ని యుద్ధములకు లోభము కారణము.
సంతుష్టి కంటె స్వర్గము లేదు."

బాలా కాలం నుంచీ ఇన్‌సోమ్నియాతో బాధపడేవారు మందుల కంటే ఎక్కువగా శాకాహారులు, పళ్ళు తిని కుదుర్చుకోవచ్చు. యోగాసనాలవల్ల నిద్ర బాగా వస్తుంది. పాశ్చాత్యులు కూడా చాలామంది ఇప్పుడు దీన్ని అనుసరిస్తున్నారు. కేంద్రనాడీ విధానం మీద ఎక్కువగా పనిచేసే మందులు వాడడం మంచిది కాదు. మంచి నైపుణ్యం అనుభవం గల వారివద్ద ఆసనాలు నేర్చుకోడం ఉత్తమం. శవాసనం, సుప్త ఊర్ధ్వ హస్తాసనం, సుప్తవజ్రాసనం, భుజంగాసనం, మత్స్యాసనం మొదలైనవి అభ్యాసం చేసుకుంటే నిద్ర బాగా పడుతుంది.

కారు. నిద్ర లేకపోవడంవల్ల తల తిరుగుతుంది. పరీక్ష ఏమీ వ్రాయలేక పోతారు. ఆరోగ్యకరమైన నిద్రకు కాల నియమాను సారంగా పని చేయడం. వ్యాయామం చాలా ముఖ్యం. ఉద్రేకం కలిగించే టీ, కాఫీలు, ఎక్కువ మసాలా పెట్టిన కూరలు, మద్య పానాలు వాడకూడదు.

సాధారణంగా కాల్షియం అధికంగా ఉన్న ఆహారం తినడం మంచిది. ప్రతి దినం నిద్ర పోవడానికి ముందు మూత్ర విసర్జనం చేసుకోడం కాళ్ళు చేతులు శుభ్రంగా కడుగుకోడం మంచిది. భృంగామలకం, బ్రాహ్మి మొదలైన ఆయుర్వేద తైలాలు, నూనెలు తలకు మర్దనా చేసుకోవచ్చు పడుకోడానికి ముందు నులివెచ్చని నీటితో స్నానం చేయడంవల్ల నిద్ర బాగా పడుతుంది. సరియైన ఆహారం, మితంగా రాత్రి పెందరాళే తినడం, ఆరుబయట ఆయాసం కలుగకుండా వ్యాయామం, మంచి గాలి ప్రసరించే శుభ్రమైన పడక గది, అతి మెత్తని అతి గట్టిగాని పడక, ఎత్తు ఎక్కువగా లేని తలగడా మంచి నిద్రకు దోహదకారులు.

పడుకునే ముందు వెచ్చని పాలు తీసుకోడం కూడా ఉత్తమం. మానసికంగా నిరుత్సాహం, ఆందోళన, తొందర, భయం, ఆరాటం, విచారం, ఒత్తిడి కలుగకుండా జాగ్రత్త పడాలి. అన్నిటి కంటే ముఖ్యం ప్రతీరోజూ పడుకునే ముందు ఏకాగ్రతతో ఇష్ట దైవాన్ని ప్రార్థించాలి. శ్రావ్యమైన సంగీతం వినడంవల్ల కూడా నిద్ర త్వరగా పడుతుంది.

## ఆరునెలల దాకా నిలువ ఉండే క్రొత్తరకం క్యాబేజీ



రష్యాలోని బైలోరష్యన్ శాస్త్రజ్ఞులు రుసినోవ్‌కా అనే క్రొత్తరకం క్యాబేజీని అభివృద్ధి పరచారు. సాధారణంగా ఇళ్ళలో దీన్ని ఆరు మాసాలదాకా నిలువ చేయవచ్చు.

"నీచుని ఘనకార్యములం దెప్పుడూ నియోగించరాదు."

# నీ అంతట నీవే వదలుకో!

పూర్వం ఒక రాజు ఉండేవాడు. ఇతడికి పరమ మిత్రుడు ఒక యోగి. రాజు యోగిని చూచినప్పుడల్లా, "నన్ను ఈ ప్రాపంచిక బంధాల నుంచి విడిపించు, నన్ను



స్వేచ్ఛగా బ్రతకనీ" అని అంటూ ఉండేవాడు. యోగి తగిన ఉపాయాలు ఎన్నో బోధిస్తూ ఉండేవాడు. కాని రాజు మళ్ళీ మళ్ళీ "నన్ను విడిపించవా?" అని దీనంగా అడిగేవాడు.

ఒక రోజున యోగి రాజుగారి మేడలో ఒక పెద్ద స్థంభాన్ని కౌగలించుకుని గట్టిగా పట్టుకుని—

"రాజా! నన్ను విడిపించు, నీకు పుణ్యం ఉంటుంది" అన్నాడు.

"చేతులు నీవే వదలకూడదూ?" అని అడిగాడు రాజు.

"కాదు కాదు, నన్ను నీవే విడిపించు" అన్నాడు యోగి.

"ఇదేమిటి వేడుక? నీ అంతట నీవు ఆ స్థంభాన్ని గట్టిగా కౌగలించుకుని పట్టుకున్నావు. నీవే చేతులు వదలి వేయవచ్చు. ఊరికే నన్ను రక్షించమంటావు. చాలా ఆశ్చర్యంగా ఉంది! నీ అంతట నీవే ఎందుకు వదులుకో కూడదు?" అన్న రాజు మాటలు విని యోగి స్థంభాన్ని వదలి—

"రాజా! నీ సమస్య కూడా ఇదే! నీ అంతట నీవే రాజ్యం, సింహాసనం, సంసారం అంటూ పీకులాడుకుంటున్నావు. నీ అంతట నీవే వదులుకోకూడదూ?" అని అన్నాడు.

వెంటనే రాజు గ్రహించాడు.

(స్వామి తురీయానంద)

---

## ఈస్టర్ ద్వీపం ఒక పెద్ద బహిరంగ పురావస్తుశాల

పసిఫిక్ మహాసముద్రంలో ఈస్టర్ ద్వీపం నేడు ఒక పెద్ద బహిరంగ పురావస్తుశాలగా ఏర్పడింది. రాతి శిల్పాలు, రాతి చెక్కడాలు, ప్రాచీన భవనాల పునాదులు మొదలైన 10,000 పురాతన నిర్మాణ శిల్పాలు భద్రపరచిన చైల్ (chile) దేశపు సాగర పురావస్తు శాల ఇది.

"వేదములు 'ఇది కాదు, ఇది కాదు' అని నిషేధింపగా శేషించిన పదార్థమే పరబ్రహ్మ స్వరూపం." —నారాయ

# కొండచిలువ గ్రుడ్లు

సర్పజాతిలో మిక్కిలి పెద్దవి కొండచిలు వలు (pythons). భారతదేశం దక్షిణ ప్రాంతాలలో సాధారణంగా అనేకచోట్ల ఇది కనిపిస్తుంది. తమిళనాడులో కొన్ని ప్రదేశా



లలో అక్కడక్కడ నివసిస్తాయి. శ్రీలంకా, మలేషియా, బర్మా, థాయిలాండ్, ఆఫ్రికా, ఆస్ట్రేలియా దేశాలలో కూడా ఎక్కువగా ఉంటాయి.

ఈ కొండచిలువనే తమిళంలో 'మలై పాంబు' అంటారు. ముఖ్యంగా ఇది దట్టమైన అడవులలోను, రాతి ప్రదేశాలలోను, నదీ తీరాలలోను సంచరిస్తూ రాత్రిపూట పైకి వస్తాయి. లేత పసుపురంగులోను, ఇటుక రంగులోను, పెద్ద పెద్ద వల్లవి మచ్చలతో పిమెంటు రంగులోను ఉంటాయి. గ్రుడ్లను పెట్టిన తరువాత తల్లిపాము ఆ గ్రుడ్లను చుట్టుకుని పొదుగుతుంది. గ్రుడ్లు పొదిగి పిల్లలు అయే దాకా ఆ పాము గ్రుడ్లను చుట్టుకునే ఉంటుంది. వీటి గ్రుడ్లు బాతుగ్రుడ్లకంటె కొంచెం పెద్దవిగా ఉంటాయి.

కొండచిలువ తోకతో చెట్ల కొమ్మలను చుట్టి గట్టిపట్టుతో వ్రేలాడుతూ ఆహారం కోసం కాచుకుంటుంది. చిన్న చిన్న క్షీరదాలు, పక్షులు, ప్రాకుడు జంతువులు మొదలైనవి వీటి ముఖ్య ఆహారం. మార్చి 29, 1981 న నీలగిరి జిల్లాలో ముదుమలై జంతు సంరక్షక వనంలో ఒక లేడిని మ్రింగుతున్న కొండచిలువ కనబడింది. అదే సంరక్షక వనంలో ఒక చిన్న దున్నపోతు పిల్లను మ్రింగుతూ ఉన్న కొండచిలువను కూడా చూశారు.

కొండచిలువ దొరికిన జంతువును తోకతో గట్టిగా చుట్టి చంపి మ్రింగుతుంది. దీని నోటిలో ఉండే వాడి పళ్లు నోటిలో జంతువును బయటకు పోనీయవు. ఇది ఆహారాన్ని పూర్తిగా మ్రింగిన తరువాత ఇక కదలకుండా దాదాపు నెలరోజులపాటు చుట్ట చుట్టుకొని ఉంటుంది. ముదుమలై జంతు సంరక్షణ వనాలలో కనిపించిన పెద్ద పాము పొడవు 17 అడుగులు. కొన్ని కొన్ని చోట్ల 20 అడుగుల పాములు కూడా కనిపించినట్లు చెబుతారు.

---

"నిర్వేదము పొందిన వారు జ్ఞానమున కధికారులు. స్వర్గాది భోగ కాములు కర్మాధికారులు భగవంతుని కథాశ్రవణము లందను రక్తి గలవారు భక్తికి అధికారులు." — నారాయణీయము

# తిమింగిలం

ఎస్. శ్రీనివాస రంగన్

గత 800 లక్షల సంవత్సరాలలో భూమిమీద నివసించే అనేక క్షీరదాలు సముద్రంలో నివసించడం ప్రారంభించాయి. సముద్ర జలాలలో ఆహారం సులభంగా లభిస్తుందనో, పిస్తాయి. తెడ్లవంటి ఫ్లిప్పర్లు, కదురువంటి శరీరం, లంగరు కొమ్ములవంటి అవయవాల వల్ల తిమింగిలం అతి సౌలభ్యంగా నీటిలో ఈద గలుగుతూంది. శరీరంలో ఉష్ణ నియం



భూమిమీద ఇతర జంతువులవల్ల కలిగే అపాయానికి భయపడో లేక అప్పుడు అక్కడుండే వాతావరణ పరిస్థితులకు తట్టుకో లేకో ఇవి భూమిని వదలి ఉండవచ్చు. ఈ పరిసర మార్పులవల్ల నీటి శ్వాస, రక్త ప్రసార, సంచలన, ఉష్ణ నియంత్రణ, పరస్పర అవగాహన మొదలైన విధానాలన్నీ భూమి మీద నివసించే క్షీరదాలకంటె విపరీతంగా ఉంటాయి.

సముద్రంలోకి వచ్చి చేరిన ఈ జంతువులన్నిటిలో ఒక్క తిమింగిలంలో నే పరిసరానుకూలమైన మార్పులు పరిపూర్ణంగా కని

## ప్రతి సంవత్సరం ఒక్కొక్క రకం అడవి జంతువు అంతరించి పోతూంది

సగటున సంవత్సరానికి ఒక్కొక్క రకం అడవి జంతువు అంతరించి పోతూంది. సుమారు 1,000 రకాల అడవి జంతువులు మరియు ఇతర పక్షులు, క్షీరదాలు అపాయ స్థితిలో ఉన్నాయి. ఒక్క భారత దేశంలోనే 5 రకాల క్షీరదాలు, పక్షులు అంతరించి పోయాయి.

---

"గతానుభవాల సంబంధంతోనే జీవిస్తాం కానీ ఎంత అనివార్యమైనా రాబోయే ఘటనలతో జీవించం." —హెచ్.జి. వెల్స్

త్రణకు తిమింగిలాలకు దళసరి చర్మం పొరల క్రింద క్రొవ్వు నూనె చేరిన పొర ఉంటుంది.

తిమింగిలాలు ఊపిరితిత్తులతో ఊపిరి పీల్చుతుంటాయి. ఇవి నీటిలోపల ఊపిరి పీల్చవు. ఊపిరి పీల్చడానికి ఇవి నీటి పై తలానికి వస్తూ ఉంటాయి వీటి ఊపిరితిత్తులు చాలా పెద్దవి. వీటిలో ఎక్కువ లోతులకు మునిగే ముందు ఇవి చాలా గాలిని పీల్చు కుంటాయి.



BLUE WHALE

బ్లూ తిమింగిలం

వీటికి ముక్కురంధ్రాలు తలపై ఉన్నాయి. కాబట్టి గాలి పీల్చటానికి చిన్న మూతి భాగాన్ని మాత్రం నీటి పైతలం మీదికి పెడుతూంటాయి. జలాంతర్గాములకుండే స్నోర్కెల్ (snorkel) లాగే వీటి బ్లోహోల్ (blowhole) పని చేస్తుంది. తిమింగిలాలలో బ్లోహోల్స్‌ను బట్టే జలాంతర్గాముల కోనింగ్ టవర్ మీది స్నోర్కెల్ నిర్మింపబడింది. తల మీది బ్లోహోలు, ఉష్ణ మరియు శీతల ధృవ సముద్రాలలో నివసించే తిమింగిలాలలో కూడా కనిపిస్తుంది. దీనికి కారణం తిమింగిలం ప్రతిసారి శ్వాసించినప్పుడు నూనె వంటి పదార్థం విడుస్తూంటుంది.

తిమింగిలాలలో ప్రత్యేక శ్వాస విధానం వల్ల ఇవి సముద్రపు ఉప్పునీటిని ఊపిరి తిత్తులలోకి పీల్చకుండా ఉండగలవు. ఇతర జంతువులకంటె ఇవి ఎక్కువ సేపు లోతుగా సముద్రంలో ఉండగలవు. ఈ సమయాలలో అధికంగా నత్రజని వాటి రక్తంలోకి ప్రవహించి అవి తిరిగి పైకి వచ్చేటప్పుడు అపాయం ఏర్పడే అవకాశం ఉంది.

కాని తిమింగిలాలలో ఉండే స్పెర్మాసెటీ (Spermaceti) అనే పదార్థం రక్తం కంటె 6 రెట్లు అధికంగా నత్రజనిని గ్రహిస్తుంది. ఇంతే కాకుండా కావలసినంత స్పెర్మాసెటీ వాటి ముక్కు రంధ్రాలలోకి చేరుతుంది. దీనివల్ల ఎటువంటి అపాయం కూడా లేకుండా అరమైలు లోతువరకు తిమింగిలం బాగా సముద్రం లోతులలోకి పోగలుగుతుంది. ఉప్పునీరు కంటిలో చేరకుండా తిమింగిలాల కళ్ళలో ప్రత్యేక గ్రంథులు జిడ్డుగాఉండే కన్నీటిని కారుస్తాయి. తిమింగి

## భారతీయ సాంస్కృతిక సాంప్రదాయం

భారతదేశపు సాంస్కృతిక సాంప్రదాయానికి 'స్వాతంత్ర్యం', 'నిర్భయత్వం' రెండు ముఖ్యమైన కీలకాలు. ఉపనిషత్తులలో, గీతలో, బుద్ధుని ఉపదేశాలలో వీటి ప్రస్తావన ఉంది

—స్వామి రంగనాథానంద

“ఒక్కక్షణం ఆత్మావలోకనం ఒక్కొక్కప్పుడు జీవితంలో మహాద్భుతంగా పరిణమిస్తుంది.” —ఆలివర్ వెండెల్ హోమ్స్

తాల చూపు సామాన్యమైనా, శ్రవణేంద్రియం మాత్రం చాలా శక్తివంతంగా ఉంటుంది. వీటికిగల ప్రత్యేక పరిసరానుకూలత వల్ల మంచి నీటి అవసరం వీటికి ఉండదు. ఉప్పు నీరు అధికంగా త్రాగనవసరం ఉండదు.

కొన్ని రకాల చేపలకు, సముద్రపు పక్షులకు ఉండే ఉప్పును వేరు చేయగల ప్రత్యేక గ్రంథులు వీటికి లేవు. అయితే సాధ్యమైనంత తక్కువ ఉప్పునీటిని త్రాగుతూ అవసరమైన నీటిని చేపలద్వారా గ్రహిస్తూ ఉండడంవల్ల తిమింగిలాలు ఈ సమస్యను పరిష్కరించుకోగలుగుతున్నాయి.

వీటి తోకరెక్క (Tailfin) ను బట్టి వీటిని సులభంగా తెలుసుకోవచ్చు. తిమింగిలం తోకరెక్క (horizontal) బల్లపరుపుగాను, చేపలలో (Vertical) లంబముగాను ఉంటుంది. వీటి దళసరి చర్మం క్రింద పేరుకుని ఉన్న క్రొవ్వును బ్లబ్బర్ అంటారు. ఈ బ్లబ్బర్‌వల్ల వీటికి రెండు లాభాలు కలుగుతున్నాయి. అతి శీతలమైన ధృవ ప్రదేశాలలో వీటి శరీరంలో ఉష్ణాన్ని తగ్గిపోనీయదు. ఉష్ణ ప్రదేశాలలో వీటికి అవసరమైన ఆహారం లభించకపోయినప్పుడు ఈ క్రొవ్వే నిలువ చేయబడ్డ ఆహారంగా వినియోగపడుతుంది.

ప్రపంచంలో మిక్కిలి భారవంతమైనది బ్లూ తిమింగిలం లేక సల్ఫర్‌బాటమ్ తిమింగిలం. దీని ఆహారం ప్లాంక్‌టన్. ఇంతవరకూ దొరికిన అతి పెద్ద బ్లూ తిమింగిలం 113.5 అడుగుల పొడవు, 170 టన్నుల బరువు ఉంది.

సముద్రంలో నివసించే క్షీరదాలన్నిటిలో తిమింగిలాన్నే మానవుడు అపేక్షిస్తాడు. దీని రెక్కలు, నూనె, మాంసము ఎక్కువగా ఉపయోగపడతాయి. తిమింగిలాలు గ్రుడ్లు పెట్టవు. పిల్ల తిమింగిలాలను ఈనుతాయి.

చాలావరకు తిమింగిలాలు సంవత్సరంలో 6 నెలలపాటు ధృవమండలాల నీటియందు

## తోడా జాతులకు గ్రీకు లక్షణాలు



తమిళనాడు నీలగిరి కొండల్లో, ఉదక మండలంలో తోడాలు ప్రాచీన ఆదిమ జాతులకు చెందినవారు. అనేక శతాబ్దాలకు పూర్వమే నీలగిరికి వలస వచ్చారు. వీరు ఆదిమవాసులైన కొండ జాతులు.

తోడాలకు గ్రీకుజాతుల అవయవ లక్షణాలు, రోమనుల ముక్కు ఉంటాయి. వీరు తమ జుట్టును కత్తిరించుకోరు. క్షౌరం చేయించుకోరు కుట్టని బట్ట శరీరానికి చుట్టుకుంటారు. వీరు నివసించే పాకలు ఎస్కిమోలు నివసించే పాకలలాగా అర్ధవర్తులాకారంలో ఉంటాయి మట్టితో గో నిర్మించుకుని చాపలతో కప్పుతారు. ఈ లకు చిన్న చిన్న గుమ్మాలు క్రి ఉంటాయి. ప్రాకుతూ లోపలక్క

"అమాయకులని నిర్ధారింపబడేవరకు సాధువులందరూ అపరాధులే."

వివసిస్తాయి. పిల్ల తిమింగిలాలను కని పెంచడానికి ఉష్ణమండల సముద్రాలకు పోతుంటాయి. పిల్ల తిమింగిలాలు బ్లబ్బర్ పెరిగి రక్షక కవచం ఏర్పడే దాకా ఈ నీటిలోనే పెరుగుతాయి.

తిమింగిలం నీటిలో ఈదడాన్ని టెయిల్ ప్రొపల్షన్ (Tail Propulsion) అంటారు. సాధారణంగా తిమింగిలాలకు 15 నాట్స్ (Knots) వేగం ఉంటుంది. బ్లూ తిమింగిలం వేగం 20 నాట్సు దాకా ఉంటుంది. తిమింగిలా లన్నిటిలో సీసా ముక్కు (Bottle nose) తిమింగిలం సముద్రంలో ఎక్కువ లోతుకు పోగలదు. సుమారు 800 పాథములు (4800 అడుగులు) లోతు దాకా వెళ్ళి, రెండు గంటలు దాకా నీటిలో ఉండి, గాలి పీల్చుకోడానికి మాత్రం పైకి వస్తూ ఉంటుంది.

సుమారు 90 టన్నుల బరువుండి 10-12 నాట్ల వేగంతో ఈదగల బ్లూ తిమింగిలానికి ఈదడానికి మాత్రం 7,80,000 క్యాలరీల ఆహారం అవసరముంటుందంటారు. శరీర జీవించడానికి మరో 2,30,000 క్యాలరీల ఆహారం అవసరముంటుంది. బ్లూ తిమింగిలం అంటార్కిటిక్‌లో వేసవిలో తమే ఆహారం తింటుంది. కాబట్టి కాలానికి సరిపోయేటట్టుగా శక్తిని సుకోడానికి దీనికి రెండింతలు లేక వ క్యాలరీల ఆహారం అవసరం బట్టి మొత్తం మీద ఒక పెద్ద నికి రోజుకి 30 లక్షల క్యాల

దీని ముఖ్య ఆహారమైన యుఫాసియా సుపెర్బా (Euphausia Superba) లేక క్రిల్ ఒక పౌండుకు 460 క్యాలరీల శక్తిని కలిగి ఉంటుంది. ఈ లెక్క ప్రకారం బ్లూ తిమింగిలానికి ఒక రోజుకి 3 టన్నుల క్రిల్ అవసరం ఉంటుంది. బ్లూ తిమింగిలాలు మాత్రం ప్రతీ వేసవికి 2,700 లక్షల టన్నుల క్రిల్‌ను తింటాయని అంచనా వేయబడింది. ఒక 90 అడుగుల తిమింగిలం శక్తి 520 హెచ్. పి. మోటారు ఉత్పాదన శక్తికి సమానమని నిపుణుల అంచనా.

(సశేషం)

## 150 సం.ల నాటి రూపాయి



తొలిసారిగా ప్రామాణికమైన రూపాయి 150 సంవత్సరాలనాటి రిజర్వు బాంక్ ఆఫ్ ఇండియాకంటె 3 రెట్లు పాతది. దీనిని 1835లో జారీ చేసారు. దీనికి ముందు దక్షిణ ఇండియాలో 72 రకాల బంగారు, 60 రకాల వెండినాణేలు, ఉత్తర ఇండియాలో 80 రకాలు వాడుకలో ఉండేవి.

"మద్యం ... ము చెలరేగిస్తుంది గాని కొనసాగించదు." —షేక్స్పియర్

# ఆరోగ్యానికి మూలికలు

# అరిత మంజరి

టి. వి. సుబ్రహ్మణ్యం

సాధారణంగా తోటల్లో, పొలాల్లో, రోడ్లలో వర్షాకాలంలో బాగా పెరిగే కలుపుమొక్క అరితమంజరి. ఇది 30 మొదలు 60 సెంటీ మీటర్లు ఎత్తుగా పెరుగుతుంది చాలాకాలం బాగా పచ్చగా ఉంటుంది. కాని మండు వేసవిలో నీరు లేనప్పుడు మాత్రం ఎండిపోతుంది. ఒక్కొక్కప్పుడు కలుపుతో పాటు దీన్ని లాగేస్తారు.



చాలా ప్రదేశాలలో దీన్నికూడా తోటకూర లాగే ఆకుకూరగా ఉపయోగిస్తారు. పోపులో వేసి కొంచెం మసాలా నూనెతో సాధారణంగా వాడతారు. చాలా రుచిగా ఉంటుంది. వృక్షశాస్త్రంలో దీన్ని అకాలిఫా ఇండికా లిన్ (Acalypha Indica Linn) అని, ఇంగ్లీషులో ఇండియన్ అకాలిఫా (Indian Acalypha) అని అంటారు. ఇతర భాషలలో-సంస్కృతం: అరితమంజరి, తెలుగు: కుప్పిచెట్టు (కొన్ని జిల్లాలలో మూర్కొండాకు) కన్నడం: కుప్పెగిడ, మలయాళం, తమిళం: కుప్పమేని, హిందీ: కుప్పి, మరాఠీ: ఖోకలీ, గుజరాతీ: వంచికంటో, బెంగాలి: ముక్తాజూరి అని అంటారు.

ఈ మొక్క ఆకుల నిర్మాణం మొజెయిక్ విధానంలో వింతగా ఉంటాయి. కాండం చుట్టూ క్రిందినుంచి పైకివచ్చే కొద్దీ ఆకుల తొడిమలు చిన్నవిగా ఉంటాయి. క్రింది ఆకుల తొడిమలు పెద్దవిగాను, పైకి రాను రాను ఆకుల తొడిమలు చిన్నవిగాను ఉంటాయి. మొక్కపైనుంచి చూచినప్పుడు ఆకులు ఏక కేంద్రీయ వృత్తాలు ఒకదానిపై ఒకటి పేర్చినట్లు ఉంటాయి. ఈ అమరికలో ప్రతి ఆకుకు కావలసిన ఉష్ణరశ్మి లభిస్తుంది. ఆకులు అతిపలచగా, మృదువుగా కోడిగ్రుడ్డు

(మిగతా 33 వ పేజీలో)

# క మెలిసి ఉండాలంటే

డా. క్లైవ్. డి. హర్లీ

సామాన్యంగా మానవులు తామంటే ఇతరులు అందరూ ఇష్టపడాలనే అనుకుంటారు. దీనికి సరళమైన మార్గం ఇతరులంటే మనం



ఎంతో ఆప్యాయపడుతున్నామనే భావం ప్రకటించుకోవాలి. మెప్పుదల. పరితాపం, కరుణ, అపేక్ష అనే గుణాలు అందరూ ఇష్టపడేవే. ఒకరి నిత్య జీవితంలో సంభవించే ప్రతి సామాన్య విషయంలోనూ మనం సుహృద్భావాన్ని ప్రకటించడానికి అలవాటు చేసుకోవాలి.

1. ఇతరులపట్ల ఆదరణ చూపాలి:

మానవాళిలో చాలామంది నిరాశతో క్రుంగిపోతారు. అలాంటివారిని ఆదరణతో పలకరించినప్పుడు వారిలో ఎంతో ఉత్సాహం, క్రొత్త చైతన్యం ఏర్పడుతుంది.

2. అవసరమైనప్పుడు అనుతాపాన్ని ప్రకటించాలి:

అనుతాపం అంటే "ఇతరులతో పాటు పరితాపం చెందడమే." మన ప్రాణమిత్రులు కష్టాలకు తీవ్ర పరితాపాన్ని పొందడం సహజం. వారితో కనికరంగా,దయతో మాట్లాడితే మనపరిచితులు ఇరుగు పొరుగు కూడా ఎంతో మేలును పొందుతారు. మాటలతోనే చెప్పక్కర్లేదు. భుజంమీద తట్టి నప్పుడు,

## రాబోట్ సంగీతం!

జపానులో ట్సుకుబా సైన్స్ ప్రదర్శనలో చాలా ముఖ్యమైనది సంగీతం పాడే మర మనిషి. ఎలక్ట్రిక్ ఇంజనీర్లు 17 కంప్యూటర్లు, టెలివిజన్ కెమేరా, తలవెంట్రుకకంటే సున్నితమైన ఫైబర్ - ఆప్టిక్ ఎలక్ట్రిక్ కేబిల్స్, 50 జాయింట్ల సహాయంతో ఒక రాబోట్ గాయకుణ్ణి సృష్టించారు. దీన్ని నిర్వహించే ఇంజనీరు ఆదేశిస్తే చాలు ఈ రాబోట్ వివిధ రకాల సుశ్రావ్యమైన సంగీతం వినిపించగలుగుతుంది.

"గొడ్డంట నరికిన మోడైనా చిగిరించును గాని
మాటలచే విరిగిన మనసు కుదుట పడదు."

కరచాలనం చేసినప్పుడు వాళ్ళ కష్టసుఖాలను మనం కూడా కొంతవరకు పంచుకుంటున్నా మనేది వారికి వ్యక్తం అవుతుంది.



3 ఇతరుల అభిరుచులను పరిశీలించాలి:

ఇతరులు ఏమేమి తినటానికి ఎక్కువగా ఇష్టపడతారు, వాళ్ళకు ఏ ఏ రంగులంటే చాలా ప్రీతి, ఏ వస్తువులు, ఆభరణాలు అంటే మోజు, ఏ సినిమా అంటే ఇష్టం, ఎటువంటి నవలలు, గ్రంథాలు అంటే చెవి కోసుకుంటారు అనే విషయాలు తెలుసుకోడం ఎంతో ముఖ్యం. వాళ్ళను విందుకు ఆహ్వానించినప్పుడు కాని, కానుకలు ఇచ్చేటప్పుడు కాని వాళ్ళ వాస్తవంగా మెచ్చుకునేవి, నిజంగా ఇష్టపడేవి పెట్టినప్పుడు, ఇచ్చినప్పుడు వాళ్ళ అభిరుచులను మనం గ్రహించినట్లు వాళ్ళకి విదితమవుతుంది.

4. ఇతరుల అభిప్రాయాలను గ్రహించాలి:

వివాదాత్మకమైన చాలా విషయాలలో వారి వారి వ్యక్తిగత అభిప్రాయాలు ఉండడం సహజం. సాధారణంగా అత్యవసరం, అతి ముఖ్యం అయిన విషయాలలో తప్ప ఇతరుల అభిప్రాయాలను ఎదిరించడానికి ప్రయత్నించ కూడదు.

5. అభినందించడం ఎప్పుడూ మరచిపోకూడదు:

దీనివల్ల ఇతరులుచేసిన ఉపకారానికి వారి ఎదల మన శ్రద్ధ, భక్తి వ్యక్తం అవుతుంది. అభినందించడంవల్ల అదనపు ఖర్చు ఉండదు. ఎదుట వారికి ఎంతో ఆనందాన్ని కలిగిస్తుంది.

6. వ్యవహార ధర్మంతో కాలాను బద్ధంగా వర్తించాలి:

వీలులేని పరిస్థితులలో తప్ప ఎప్పుడైనా

---

## రష్యాలో మహిళలు

సోవియట్ యూనియన్‌లో వ్యాపారం, కేటరింగ్ సంస్థలలో 83 శాతం, ఆరోగ్య సంరక్షణ, దేహాభివృద్ధి, సాంఘిక భద్రత సంస్థలలో 82 శాతం, ఉపాధ్యాయవృత్తిలో 75 శాతం, సాంస్కృతిక కార్యక్రమాలలో 74 శాతం ఉద్యోగస్తులు మహిళలు.

పరిశ్రమలలో పనిచేసే వారిలో సగానికి సగం మహిళలే. ఖచ్చితమైన పనిముట్ల తయారీ, రేడియో పరిశ్రమలలో మహిళల శాతం 85-87. ఇతర పనిముట్లు తయారీ మరియు ఎలక్ట్రానిక్ పరిశ్రమలలో 45-47 శాతం మహిళలే పని చేస్తున్నారు.

'ఎన్నడూ ఇబ్బందులకు ఇబ్బంది పడవద్దు,
ఇబ్బందులు నీకు ఇబ్బంది కలిగించేదాకా."

కాలాన్ని అతిక్రమించినప్పుడు మన కోసం నిరీక్షిస్తున్న ఎదటివారిని లక్ష్యం చేయడం లేదనేది వ్యక్తమవుతుంది. అదే విధంగా, చెప్పిన దానిని చేయకపోవడం. మన కిచ్చిన ఆదేశాలను అనువర్తించకపోవడం, పరాయి వస్తువులను పోగొట్టడం, అరువుతెచ్చిన



వాటిని ఇవ్వకపోవడం మొదలైన వాటివల్ల వాళ్ళను చులకనభావంతో చూస్తున్నామనే అభిప్రాయం వారిలో ఏర్పడుతుంది. ఇది స్వాభిమానం తప్ప వేరు కాదు.

7. ఇతరులు దేనివల్ల ఆనందిస్తారో తెలుసుకోడం ముఖ్యం:

ప్రతీవారి జీవితంలో హాస్యం సరసతను కలిగిస్తుంది. తియ్యని పరమాన్నంలో ఇంగువ కలపం, చారులో ఏలక్కాయలు వేయం. దేనికి ఏది అనువుగా ఉంటుందో తెలుసుకోవాలి. ఒక వ్యక్తికి హాస్యంగానూ, వినోదంగానూ ఉండే విషయం మరో వ్యక్తికి వికటించవచ్చు. కాబట్టి ఇతరులకు దేనివల ఆనందం కలుగుతుంది: దేనివల్ల సంతోషిస్తారు అనేది తెలుసుకోడం ఎంతైనా ముఖ్యం. మన హాస్యం ఎదుటివారి మాటలకు, చేతలకు అనుగుణ్యంగా ఉండాలి.

8 చిన్న చిన్న విషయాలలో మంచి చెడ్డలు ఆలోచించాలి:

ఎంతటి అల్ప సహాయమైనా ఎంతో కని కరాన్ని కలిగిస్తుంది. ఇతరులకు ఏ కొంచెం సహాయపడ్డా వారి వారి అవసరాలకు ఆదుకుంటున్నామని గ్రహిస్తారు. దీనివల్ల మనం వీలైనంత దయాదాక్షిణ్యాలను ప్రకటించ గలుగుతాం.

9. ఇతరులు ఏం చేస్తున్నారో గమనించాలి:

మీ ప్రయాణం బాగా సాగిందా? మీకు

---

## చైనా దేశపు సుప్రసిద్ధ కవి

చైనా దేశపు సుప్రసిద్ధ కవి లీటెయ్‌పో (Litaipo) వైను కప్పులు త్రాగుతూ ఆశువుగా కవిత్వాన్ని వ్రాశాడు చైనాదేశపు చక్రవర్తి మింగ్‌హువాంగ్ (710-762) లీకి కార్యదర్శిగా ఉంటూ వైన్ త్రాగిన మత్తులో ఉండగా చెప్పే ముత్యాలవంటి పద్యాలను రికార్డు చేశారు. ఈనాడు ఇవి ప్రాచీన చైనా సాంప్రదాయాన్ని చాటుతున్నాయి ఒక రోజు రాత్రి వెన్నెలలో పడవ మీద విలాస యాత్ర చేస్తూ నీటిలో ప్రతిఫలించే చంద్ర బింబాన్ని ముద్దు పెట్టుకోబోయి లీటెయ్‌పో ప్రమాదవశంగా నీటిలో పడి మునిగి మరణించాడు.

"ఒకే మతం—సత్యమనే మతం
ఒకే కులం—మానవత్వం అనే కులం." -స్వామి శివానంద

అన్నీ అందాయా? బాగా వడ్డించారా? మీరు మీ పనిని ముగించుకున్నారా? అనే చిన్న చిన్న



ప్రశ్నల వల్ల, పరామర్శ వల్ల ఇతరులు ఏం చేస్తున్నారో గ్రహించినట్టు వారికి తగినంత విలువ, గౌరవం, మర్యాద ఇస్తున్నట్టు తెలుసుకుంటారు.

10. ఓర్పుతో వినడాన్ని నేర్చుకోవాలి:

మంచిగా మాట్లాడటం ఒక సమాజ కళ. ఓర్పుగా వినడం అందరూ అచరించగల సామాన్యకళ. దీనివల్ల ఇతరులతో కలుపుగోరుతనంగా ఉండడం ప్రకటితమవుతుంది. వాస్తవంగా కొందరు యమబోరు కొడతారు. అయితే సాధారణంగా ఇతరులు మనల్ని బోరు కొడుతున్నారంటే మనం వారు చెప్పేది సరిగా వినడం లేదనే అర్థం.

మనం సరసంగా ఉంటే అందరూ సరసంగానే ఉంటారు. లోకం అంతా సరసంగానే ఉంటుంది.

కలసి మెలసి కలుపుగోరుగా ఉండటం ఒక తంత్రం కాదు, మాయాజాలం కాదు. మనం ఇతరులను ప్రేమించాలి. అహంభావాన్ని పోగొట్టుకోవాలి. మన సౌఖ్యం, ఆనందం, సంతోషం, లోకం మీదే ఆధారపడి ఉంటుంది.

(29 వ పేజీ తరువాయి)

ఆకారంలో ఉంటాయి. ఆకు చుట్టూ వంకీలుంటాయి. పువ్వులు గుత్తులుగా వస్తాయి. వీటిలో ఆడజాతికి చెందిన పువ్వులు, పురుషజాతికి చెందిన పువ్వులు విడివిడిగా ఉంటాయి. ఆడజాతికి చెందినపూలు విడి విడిగాను, పురుషజాతికి చెందినవి గుత్తులు గుత్తులుగాను ఉంటాయి.

అతిమంజరికి విశిష్టమైన మూలికా విశేషం, మంచి ఔషధ విలువ ఉంది. ఊపిరితిత్తులకు, జీర్ణకోశానికి సంబంధించిన అనేక రోగాలకు దివ్యౌషధంగా పనిచేస్తుంది. దీర్ఘకాలంనుంచీ ఉన్న దగ్గు, ఒగర్పు, ఆయాసాలకు రోజుకు రెండు పర్యాయాలు ఆకులరసం ఒక్కొక్క చెంచాడు వాడతారు. దగ్గుకి మంచి ఉపశమనం కలిగిస్తుంది. ఆకుల రసం నిరపాయకరమైన విరేచన కారి. కడుపులోని క్రిములను నిర్మూలిస్తుంది. సక్రమంగా ఈ మందులు వాడితే కీళ్ళనొప్పులు, వాతం హరిస్తుంది. శరీరానికి తగిలిన గాయాలకు, పుళ్ళకు ఆకులను నూరి ముద్దపట్టిస్తే గుణం కలుగుతుంది. పరగడుపున పెరుగులో కలిపిన దీనిరసం కామెర్లకు ఔషధం.

ఇండియన్ అకాలిఫా ఈనాడు హోమియోపతి వైద్య విధానంలో చాలా ప్రసిద్ధమైన ఔషధం. మదర్ టింక్చర్‌గాను, పొటెన్సీల లోను కూడా దీనిని వాడతారు.

# లుకు

జగత్ ఎస్. బ్రైట్

**చేయతగినవి, చేయతగనివి:**

ఎటువంటి ప్రతిఫలం ఆశించకుండా ఉపయుక్తమైన కార్యాలను మాత్రమే చేపట్టు. తగిన సొమ్ము ముట్టచెబుతాం అని మాట ఇచ్చినా, ఎంత సొమ్ము ఇచ్చినా అయోగ్యమైన పనుల జోలికి ఎన్నడూ పోవద్దు.

• • •

**మరణానికి ముందే వదలుకో:**

మరణించిన తరువాత వదల దలచుకున్నవాటిని మరణించక ముందే వదులుకుని ఇక లోకంలో మరణించామనే భావంతో జీవించు.

• • •

**మనస్సుకు క్షోభకరమైనవి:**

మనస్సుకు క్షోభను కలిగించేవి ,సుఖ సంతోషాలను కలిగించ లేవు.

• • •

**ప్రాణ శక్తులకు, మరణ శక్తులకు మధ్య పెనుగులాట:**

ప్రపంచంలో ఒక ప్రక్క ప్రాణ శక్తులకు, మరో ప్రక్క మరణ శక్తులకు మధ్య నిత్యం యుద్ధం జరుగుతూ ఉంటుంది. ప్రాణ శక్తులది పై చేయిగా ఉన్నంత కాలం జీవించ గలం.

• • •

**సౌందర్యాన్ని సృష్టించు:**

అంద వికారమయమైన ఈ ప్రపంచంలో సౌందర్యాన్ని సృష్టించు.

• • •

**ప్రపంచాన్ని నీలోనే చూచుకో:**

ప్రపంచంలో మనం మనను చూసుకునే బదులు మనలోనే ప్రపంచాన్ని గ్రహించాలి.

(సశేషం)

---

## వేసవి సెలవులైనాయి




ఎక్జిమినేషనులు పూర్తిగా 'అయేదాకా ఉండవలసింది!

---

"దైవగతులెవ్వ రెట్లు నడచునో యెవరి కెరుక."

# కలంస్నేహితులు

[మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/-లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు.]

1. మహమ్మద్ అథర్, C/o టీబీ క్యాన్సర్ హాస్పిటల్, మలక్ పేట, హైదరాబాద్-500 024.

కలం స్నేహం, వ్యాసాలు వ్రాయడం.

2. బిర్రుదుల ధర్మయ్య. 20 సం.లు, 10-వ తరగతి విద్యార్థి, S/o బి. ఎల్. లింగయ్య, ఇం. నెం. 1-19/B ఆంధ్రా కాలనీ వీధి, ఊట్కూరు గ్రామం, లక్షెటిపేట పోస్టు మరియు తాలూకా, (ఆదిలాబాదు జిల్లా) 504 215.

పేపరు చదవడం, రేడియో వినడం, పుస్తకాలు చదవడం.

3. ఎమ్. నరేష్, 13 సం.లు, 9-వ తరగతి విద్యార్థి, S/o భుజంగరావ్, జి. ఇ. కాలనీ, S.O. గుమ్మ లక్ష్మీపురం-532 523, (విజయనగరం జిల్లా).

పుస్తకాలు చదవడం, స్నేహంచేయడం, జోకులు వేయడం.

4. భగవాన్‌దాస్ భట్టడ్, S/o బి. పురుషోత్తం, క్లాత్ మర్చంట్ స్టేషన్ రోడ్డు, కారేపల్లి-507 122, (ఖమ్మం జిల్లా).

కలం స్నేహం, పుస్తకాలు చదవడం, కామెంట్రీ వినడం.

5. చంగల్వల సత్యనారాయణ మూర్తి: పదవ తరగతి విద్యార్థి. S/o రామలింగేశ్వరరావు గోదావరి వీధి, ద్వారపూడి-533 341, (తూ గో జిల్లా).

వార్తలు వినడం, పుస్తకాలు చదవడం, స్నేహం చేయడం.

## ముంగిస త్రాచుపామును మ్రింగుతుంది



భారతదేశంలో అనేక చోట్ల సాధారణంగా బొరియలలో నివసించే ముంగిస (మంగూస్) పాములను చంపి తింటుంది. ఇది ఏ అపాయం లేకుండా త్రాచుపాము తలమీద విషగ్రంథులను కూడా మ్రింగుతుంది.

"పురాకృత సుకృత సంపద్విలాసములు తల భంగురములు."

# వీలునామా

ఎస్. స్వామినాథన్

వీలునామా (మరణ శాసనం) ఒక దస్తావేజు. ఇందు మూలంగా ఒక ఆసామి తన మరణానంతరం తన చర, స్థిర ఆస్తుల పంపకాల విషయం మరియు పరిష్కార విధానాన్ని గురించి తన కోరికను తెలియజేసాడు.



ఇండియన్ సక్సెషన్ ఆక్టు ప్రకారం టెస్టేటర్ (వీలునామా వ్రాసి ఇచ్చే ఆసామి) తన మరణానంతరం తన ఆస్తి నిర్వహింపబడవలసిన విధానాన్ని చట్టబద్ధంగా తెలియజేసే పత్రమే విల్లు లేక వీలునామా అని నిర్వచింపబడింది. కాబట్టి విల్లు అనగా వీలునామా, టెస్టేటర్ మరణానంతరమే అమలులోకి వస్తుంది. ఆసామి జీవిత కాలంలో ఎటువంటి చట్టబద్ధత లేకుండా ఎప్పుడైనా మార్చుకోగల పత్రం వీలునామా. టెస్టేటరు దీంట్లో విషయాలు ఇతరులకు ఎవ్వరికీ తెలియజేయ కూడదు.

మైనరు (18 సం లు దాటని) కాని, స్థిర బుద్ధి గల ప్రతీ వ్యక్తి వీలునామా లేక విల్లు ద్వారా తన ఆస్థి పరిష్కార విషయం నిర్ణయించవచ్చు। కాబట్టి చెవిటి, మూగ, గ్రుడ్డి

---

## బ్రిటన్‌లో 300 మంది మాత్రమే చదవగల నవల

560 లక్షల జనాభాగల బ్రిటన్‌లో 300 మంది మాత్రమే చదవగల 'ది బ్లడీ క్రౌన్ ఆఫ్ కెల్‌ట్యా' అనే నవలను 62 సం. ల వయస్సు గల రిటైర్డ్ స్కూలు మాస్టరు మెల్‌విల్ బెన్నెట్ వ్రాసాడు. ఈ నవల అట్లాంటిక్ మహా సముద్రంలోకి చొచ్చుకుని పోయే సౌత్ వెస్ట్ ఇంగ్లండ్ కౌంటీ ఆఫ్ కార్నల్‌వాల్‌లో అంతరించి పోయిన కార్నిష్ భాషలో వ్రాయబడింది.

"వస్తు ప్రపంచంలోనూ నివసిస్తాడు, విలువల ప్రపంచంలోనూ నివసిస్తాడు – మానవుడు ఉభయచరం." —డబ్ల్యు. ఆర్. ఇంగ్

వారు తమ అనంతరం తమ ఆస్థి పరిష్కార విషయం తెలిపినవారైతే విల్లు వ్రాసుకో దానికి అనర్హులు కారు.

అంతేగాక సాధారణంగా బుద్ధి సరిగా పని చేయని పిచ్చివాడు బుద్ధి సరిగా ఉన్న సమయంలో విల్లు వ్రాయవచ్చు. కానీ బాగా త్రాగడం చేతగానీ, ఏదైనా రోగ కారణం చేతగానీ, మరి ఏ కారణం చేతగానీ తను ఏం చేస్తున్నదీ తనకే తెలియని పరిస్థితిలో విల్లు వ్రాయడానికి వీలులేదు. బుద్ధి సరిగా ఉందనడానికి తన ఆస్థి వివరం విలువ తెలిపి ఉండాలి. తాను విల్లులో వదలిపెట్టని వారికి తన ఆస్థి విషయమై వారికి గల హక్కులను తెలిసి ఉండాలి.

మభ్యపెట్టి, బలవంతం చేసి (చంపుతాను, అపకీర్తిపాలు చేస్తాను అని భయపెట్టి) వ్రాయించుకున్న విల్లు పనికిరాదు. అదే విధంగా బెప్టేటరు మనస్సును మార్చి వ్రాయించుకున్న వారికి, విల్లులో షరతులు వ్రాయించుకున్న వారికి ఆస్థికి హక్కు ఉండదు. బెప్టేటరు ఎప్పుడైనా విల్లును రద్దు చేసుకోవచ్చు కాబట్టి ఒక బెప్టేటరు తన జీవిత కాలంలో ఎన్ని విల్లులనైనా వ్రాయవచ్చు. ఆ విధంగా వ్రాసుకున్న విల్లులలో ఎన్ని మార్పులనైనా కూడా చేసుకోవచ్చు. అంతేగాక ఇంతకు ముందు వ్రాసిన విల్లులో వదలివేసిన అదనపు విషయాలను కూడా చేర్చుకోవచ్చు. అప్పుడు కొడిసిల్(Codicil) అనే క్రొత్త దరఖాస్తును జతపరచి ప్రధానమైన విల్లుకు చేర్చవలసిన క్రొత్త విషయాలు వ్రాయవచ్చు

విల్లు మరియు కొడిసిల్‌కు ముఖ్యంగా అవసరమైనది ఇద్దరి సాక్షుల సంతకాలు, ప్రతి సాక్షి ప్రత్యక్షంగా వ్రాసిన విల్లు అయితే విల్లులో, కోడిసిల్ అయితే కోడి

## ప్రపంచంలో మూడు రకాల మానవులున్నారు



ప్రపంచంలో మూడు రకాల మానవులు ఉన్నారు. రాతిమీద చెక్కిన అక్షరాల వంటి వారు మొదటి రకం. వీళ్ళు అతి కోపిష్టులు. దీర్ఘకాలం పాటు క్రోధభావాన్ని ఉంచుకుంటారు. రెండవ రకం ఇసుకమీద వ్రాసిన అక్షరాలవంటివారు వీరూ కోపిష్టులే. అయితే క్రోధభావాలు మెల్లిగా చెరిగిపోతాయి. మూడవ రకం నీటి ప్రవాహంమీద వ్రాసిన అక్షరాల వంటివారు. దేన్నీ పట్టించుకోరు. వీరి మనస్సులు స్వచ్ఛమైనవి, అచంచలమైనవి. —గౌతమ బుద్ధుడు

"సహజ సౌందర్యవతులకు అన్నియు అలంకారములే."

విల్‌లో టెస్టేటరు వ్రాస్తూండగా చూచి ఉండాలి. మరియు టెస్టేటరు తన సమక్షంలో సాక్షులు సంతకాలు చేయడం చూడాలి.

ఈ విల్లు లేక వీలునామాకు స్టాంపు కాగితాలు గాని, ప్రత్యేక డాక్యుమెంట్లు గాని అవసరం లేదు. విల్లు మామూలు తెల్ల కాగితం మీద టెస్టేటరు స్వతంగా ఇద్దరు సాక్షుల ముందు వ్రాసి సంతకం చేయాలి టెస్టేటరు సమక సంతకం చేయలేకపోతే వేలి ముద్ర వేయాలి. లేకపోతే టెస్టేటరు అనుమతి మీద టెస్టేటరు తరపున ఎవరైనా సంతకం చేయవచ్చు. ఈ విల్లుపైన టెస్టేటరు సంతకం చేస్తూండగా గానీ, వేలిముద్ర వేస్తూ ఉండగా గానీ, లేకపోతే టెస్టేటరు తరపున ఎవరైనా సంతకం చేస్తూ ఉండగా గానీ చూచిన ఇద్దరు సాక్షుల సంతకాలు ఉండాలి.

ఎవరైనా సరే. మైనరైనా సాక్షిగా ఉండవచ్చు. సాక్షికి విల్లులో వివరాలు తెలిసి ఉండాలని లేదు. విల్లులోని వివరాలు కనిపించకుండా, సంతకం సాక్షులు చేవ్రాలు మాత్రమే కనిపించేటట్టు విల్లును మడిచి పెట్టవచ్చు కూడా.

ఇండియన్ రిజిస్ట్రేషన్ చట్టం ప్రకారం విల్లు రిజిస్టరు చేయించవలసిన అవసరం లేదు. అయినా టెస్టేటరు మరణానంతరం కోర్టు ఉత్తరువు ప్రకారం విల్లు చేయబడిన వారికి ఇచ్చేటట్టు టెస్టేటరు విల్లును కవరులో పెట్టి మూసి అస్యూరెన్సు రిజిస్ట్రారు వద్ద డిపాజిట్టు చేయవచ్చు.

హిందువు, ముస్లిం కాకుండా ఇతరులు అనగా ప్రతి క్రిస్టియన్, జ్యూ. పార్శీ లేక ఆర్మేనియన్ వివాహమైనప్పుడు క్రొత్త విల్లు వ్రాసుకోవాలి. వీరిలో వివాహం వల్ల మొదటి విల్లు రద్దు అయిపోతుంది. దీనివల్ల క్రొత్తగా వివాహమైన భార్య హక్కులకు నష్టం ఉండదు.

సాధారణంగా ఒక విల్లు టెస్టేటరు చేత

## మెసపటోమియా వాస్తవ్యులు మట్టి పలకలమీద వ్రాసారు



అనేక వేల సంవత్సరాలకు పూర్వం ప్రాచీన మెసపొటేమియా (ఇప్పటి ఇరాక్)లో నివసించే ప్రజలు బంకమట్టి పలకలమీద వ్రాసేవారు. ఇవి బంకమట్టి పుస్తకాలుగా తయారుచేసేవారు. మోయడానికి వీలు లేకుండా బ్రహ్మాండంగా ఉండే వీటిని వెదురు పెట్టెలలో భద్రపరిచేవారు. కొంత కాలానికి వెదురు పెట్టెలకు బదులుగా కొయ్య పెట్టెలు, బీరువాలు వాడారు.

('మిషా' సౌజన్యంతో)

"మనిషి ఎక్కువ పని చేసినప్పుడు విశ్రాంతి ఆనందాన్ని ఇస్తుంది. విశ్రాంతి మోతాదు ఎక్కువైతే చేతినిండా పని కావాలనిపిస్తుంది." —రాబర్ట్ గ్రాసింగ్

వ్రాయబడి ఇద్దరు సాక్షుల సంతకాలు ఉండాలి. అయినా చేతికి అనువుగా కాగితం, కలం దొరకదు కాబట్టి, అన్ని అనుమాయితీలు జరగడానికి వీలు ఉండదు కాబట్టి ప్రత్యేకంగా యుద్ధరీత్యా గాని, లేక ప్రత్యక్షంగా యుద్ధంలో ఉన్న సైనికుని పట్లగాని, సై విధంగా ఉండే వైమానికుని పట్లగాని, ఓడ మీద పనిచేసే మారినర్ పట్లగాని ఇది వర్తించదు.

ఇటువంటి విషయాలలో సాధారణంగా జరిగే అనుమాయితీలు అన్నీ జరగక్కర్లేదు. కాబట్టి వీటిని ప్రివిలెజ్డ్ (privileged) విల్లులు అంటారు. ఇండియన్ సక్సెషన్ చట్టం ప్రకారం వీటి ప్రత్యేక నిబంధనలను అనుసరించాలి. ఆ మాటకొస్తే వీరి విల్లు వాఙ్మూలకంగా కూడా ఉండవచ్చు. సాధారణంగా వీలునామా ప్రకారం నియమింపబడిన అధికారి ఎగ్జిక్యూటరు ఆస్తులను విల్లు ప్రకారం పంచుతాడు. ఆ విధంగా ఎగ్జిక్యూటరును విల్లులో సూచింపక పోయినప్పుడు వారసులు ఎవరైనా ఎగ్జిక్యూటరుగా ఉండవచ్చు. విల్లు ప్రకారం ఈ వారసుడు ఆస్తికి అనర్హుడు కాడు.

టెస్టేటరు మరణానంతరం విల్లు ప్రకారం లాభం పొందని వారుగాని, వారసత్వం పొందని వారుగాని విల్లును మార్చవచ్చు లేక చించివేయవచ్చు. కాబట్టి ఇట్టి ఉపద్రవాలు జరగకుండా టెస్టేటరు ఒక బ్యాంకును ఎగ్జిక్యూటరుగా పెట్టి విల్లు కాపీని ఆ బ్యాంకులో డిపాజిట్టు చేయవచ్చు. ఈ విధంగా చేయడంవల్ల విల్లును మార్చడానికి గాని, అన్యాక్రాంతం చేయడానికి గాని వీలుండదు. రిజిస్ట్రేషన్ చట్టం ప్రకారం టెస్టేటరు తన జీవిత కాలంలో ఎప్పుడైనా విల్లును రిజిస్టరు కూడా చేయవచ్చు. ●

## ప్రపంచంలో ఎక్కలి ఉన్నతమైన శిఖరాలు



| | | |
|---|---|---|
| ఎవరెస్ట్ (చోమోలుంగ్మా) | 8848 | మీటర్లు (ఎత్తు) |
| కె2 | 8811 | ,, |
| కాంచనగంగ | 8595 | |
| లోట్సే | 8511 | |
| మకాలూ | 8481 | |
| ధవళగిరి | 8172 | |
| మానస్లు | 8156 | |
| చోఓయు | 8153 | ,, |
| నంగపర్బత్ | 8126 | ,, |
| అన్నపూర్ణ | 8078 | |

ఈ పర్వత శిఖరాలన్నీ హిమాలయ పర్వతశ్రేణిలో, నేపాలు, సిక్కిమ్, టిబెట్ లేక జమ్ము, కాశ్మీరులలో ఉన్నాయి.

“వాక్కును పరిపరచుకొనుట వ్యాకరణ ప్రయోజనం.”

# వీరిని గురించి తెలుసుకోండి

రాజీవ్ గాంధీ: భారత దేశపు ప్రధాన మంత్రి. వీరు డెహరాడూన్ డూన్‌స్కూల్ లోను, ఇంగ్లండు కేంబ్రిడ్జ్ ట్రినిటీ కాలేజీ



లోను విద్యను అభ్యసించారు. రాజకీయా లలో చేరే ముందు ఇండియన్ ఎయిర్ లైన్స్‌లో పైలెట్‌గా కొంత కాలం పని చేశారు. అమెచూరు రేడియో, ఫోటోగ్రాఫీ, షూటింగ్, విమానంలో ఎగరడం వీరి హాబీలు.

• • •

మాక్స్ ముల్లర్: జర్మన్ దేశానికి చెందిన సుప్రసిద్ధ ఇండాలజిస్టు. తన 24 వ ఏట ఇంగ్లండులో ఋగ్వేదాన్ని ప్రచురించారు. భారతదేశ ప్రశస్తిని తూర్పు పశ్చిమాలకు తెలియజేసిన మహా మేధావి. వీరు భారత దేశాన్ని ఎన్నడూ సందర్శించక పోయినా వివేకానంద వంటి అనేక భారతీయులు ఆక్స్ ఫర్డ్‌లో వీరి పవిత్ర గృహాన్ని సందర్శించారు.

• • •

శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయ: కళకు, చేతి పరిశ్రమలకు సలిపిన అపార సేవకు ఈమె అనేక బహుమతులను అందుకున్నారు. సంగీత నాటక అకాడమీకి ఛెయిర్‌మన్‌గా ఉండి కళాభివృద్ధికి ఎంతో పాటుపడ్డారు. ఇండియన్ నేషనల్ థియేటర్ సెంటర్‌ను స్థాపించారు. 1966 లో జాతీయ నాయకత్వానికి రామన్ మెగసేసే బహుమతిని అందుకున్నారు. ఇండియన్ హాండీ క్రాఫ్ట్స్, ఇండియన్ కార్పెట్స్, అవేకెనింగ్ ఆఫ్ ఇండియన్ వుమన్ హుడ్, ఎంబ్రాయిడరీస్ ఆఫ్ ఇండియా మొదలగు 12 గ్రంథాలను ప్రచురించారు.

• • •

శ్రీమతి దుర్గా ఖోటే: ప్రసిద్ధి పొందిన సినీమా నటి మరియు సినీమా ప్రొడ్యూసరు. సినీమాలలో మొదట హీరోయిన్‌గా ప్రారంభించింది. భారత దేశంలోని సినీమా అభివృద్ధికి కలిగించిన సేవకు ఈమెకు దాదా సాహెబ్ ఫాల్కే అవార్డును అందజేశారు.

"సత్యాన్ని ప్రప్రథమంగా అన్వేషించుకుంటే శివం, సుందరం వాటంతట అవే ఏర్పడతాయి." —మహాత్మాగాంధీ

# రకరకాల మేనేజిమెంట్

హెచ్. కె.



'మేనేజిమెంట్' అనేది వ్యక్తిగతంగా అనువర్తిస్తుంది. ఇది వ్యక్తి స్వభావాన్నిబట్టి అనుభవాన్నిబట్టి ఏర్పడుతుంది.

మేనేజిమెంట్ అంటే ఏమిటి? రకరకాల మేనేజిమెంట్లు ఏవి? ప్రత్యక్షంగా ఆ కార్యక్రమంలో ఉన్నవారు ఏమనుకుంటారు? ఇది తమకు సాపగదు అనుకునేవారి సంగతి ఏమిటి? వివరంగా తెలుసుకుందాం. మేనేజిమెంటు ఒక ప్రత్యేక కళ, వ్యక్తి నైపుణ్యం, చాకచక్యం. అతి తక్కువ కార్మికవర్గం, వస్తు సమూహం, సొమ్ము, వివరాలు, కాలం మొదలైన సాధన సంపత్తులతో అనుకున్న లక్ష్యాలను సాధించగల నైపుణ్యమే మేనేజిమెంటు. ఈ సాధన సంపత్తులన్నీ పుష్కలంగా ఉంటే మేనేజిమెంటు అవసరముండదు. మేనేజర్లకు అసలు చోటే ఉండదు. తక్కువ సదుపాయాలతో, సాధనాలతో లక్ష్యాన్ని సాధించడం మేనేజిమెంటు ముఖ్య ధర్మం. వివిధ కార్యకలాపాలతో అడుగడుగునా అవలంబించే నిరంతర కార్య పరిష్కార విధానం మేనేజిమెంటు, మేనేజరు చేసేపని.

సాధించిన లక్ష్యాలకు దోహదకారి అయిన అంతర్గత చైతన్యశక్తి మేనేజిమెంటు అనిపించుకుంటుంది. ఇతరుల శక్తి సామర్థ్యా

---

## జపాను ఎక్కువగా రాబోటులను ఉపయోగిస్తోంది

ఇప్పుడు జపాను రాబోటులను మిక్కిలి ఎక్కువగా ఉపయోగిస్తోంది. ప్రపంచంలో 65 శాతం రాబోట్లు జపానులో ఉన్నాయి. ఇక్కడ 50,000 పైగా సాధారణ సింగిల్ టాస్క్ రాబోట్లు పనిచేస్తున్నాయి. ప్రతి సంవత్సరం 200 రాబోట్లు తయారుచేసే కంపెనీలు 17,000 రాబోట్లను ఉత్పత్తి చేస్తున్నాయి.

లను, సాధన సంపత్తులను వినియోగించు కుంటూ పనిని సాధించుకునే రహస్యమే మేనేజిమెంటు. ఈమధ్య మేనేజిమెంటు అంటే అర్థం కొంచెం మారింది. ఇప్పుడు మేనేజర్లు పని చేయించుకోడంకాదు, పనిచేసే వారితో కూడా చేరి పనిచేస్తారు.



మేనేజర్లు తమంతట తాము ప్రత్యక్షంగా అన్నిపనులు చేయనప్పటికీ మొత్తం కార్య రంగంలో ప్రతీ ఘట్టంలోనూ కలుగజేసు కుంటారు. ఇతరులచేత కాలానుగుణంగా వారి శక్తిని వినియోగిస్తూ తద్వారా అతి తక్కువ వ్యవధిలో, మిత వ్యయంతో లక్ష్యా లను సాధిస్తారు. అసాధ్యమైన పనులను సార్థకం చేసుకోవాలంటే కార్మికులను పురమాయించాలి. వారికి తగిన తర్ఫీదు కలి గించాలి. వారిని పురికొల్పాలి. వారిని సజా వైన మార్గంలో పెట్టాలి. ఆశ కలిగించాలి. ప్రేరేపించాలి. ఇదే మేనేజిమెంట్ నాటకం.

మేనేజిమెంట్ అంటే ఒక్క పరిశ్రమ లకు, వ్యాపారాలకే కాదు. వంట ఇంటిలో ప్రారంభమయ్యే వంట దగ్గరనుంచి ఆసు పత్రిలో ఆపరేషన్ థియేటర్‌లో ఆపరేషన్ దాకా మేనేజిమెంట్‌లో వ్యవహారాలు సవాలక్ష ఉంటాయి. మేనేజిమెంటు అవసర ముండని అవకాశమే కనిపించదు.

మాటవరసకి ఒక వివాహ విషయం పరిశీలిద్దాం. వివాహంలో అనుసరించవలసిన తతంగాలు ఎన్నెన్నో ఉంటాయి. అన్నీ ప్లాన్ చేసుకుని వాటిని తు. చ. తప్పకుండా ఆచ రణలో పెట్టాలి. చేసేపనులు పరస్పరం పొందిక కుదిరి ఉండాలి. వధువు తండ్రి 'మేనేజిమెంట్' పదవిని నిర్వహిస్తాడు అను కుందాం. వివాహం నిర్విఘ్నంగా కొనసాగా లంటే అతడు మేనేజిమెంట్‌లో మెళకువ లన్నిటినీ అవలంబిస్తూ వినియోగించుకోవాలి. పెళ్ళికొడుకు వారికి అన్ని సదుపాయాలు చేయాలి. వారికి కోపానికి తావీయకూడదు. సంతృప్తిని కలిగించాలి. ఆ సమయానికి ఇదే అతడి ముఖ్య లక్ష్యం. కాబట్టే తెలుగులో 'ఇల్లు కట్టిచూడు. పెళ్ళిచేసి చూడు' అన్నారు. ఇందులోనే తెలిసిపోతుంది మేనేజిమెంటు నైపుణ్యం. ఇల్లు కట్టడం సామాన్యమా

## 90 ఏళ్ళ పైబడిన వయోవృద్ధులు 15,000 మంది

సోవియెట్ ట్రాన్స్‌కాకేసియన్ రిపబ్లి క్‌లో అజెర్‌బెయిజాన్ గ్రామంలో నివ సిస్తున్న గయులాండామ్ అల్లాఖ్యరోవా వయస్సు 151 సంవత్సరాలు. అజెర్ బెయి జాన్‌లో 90 సంవత్సరాలకు మించిన వయో వృద్ధులు 15,000 మంది ఉన్నారు.

"కష్ట సుఖాలు, లాభ నష్టాలు, జనన మరణాలు ఒకదాన్ని ఒకటి వెంబడిస్తూ వచ్చేవే. ధైర్యంతో ఎదుర్కో. కష్టాలకు క్రుంగిపోవద్దు, సుఖాలకు పొంగిపోవద్దు."

(బిల్డింగ్ ప్లాను గీయించాలి, కార్పొరేషన్ అనుమతి పొందాలి, సిమెంట్ దొరకాలి, లేబరు లభించాలి. అప్పు (లోను) వాయిదాలు చెల్లించాలి.)



సామర్థ్యవంతమైన ఒక ఇంటి ఆడబిడుచు మేనేజరుగిరికి మంచి ఉదాహరణ. సాధారణంగా ఇంట్లో జనసహాయం, ఆదాయం, సమయం మొదలైనవన్నీ చాలా సంకుచితం. ఆశలు, ఆశయాలు ఆకాశాన్ని అంటుతూంటాయి. లభ్యమయ్యే సాధన సంపత్తులను వినియోగించుకుంటూ ఇంటిగుట్టు బయటపెట్టకుండా వ్యవహారాలు చక్కబెట్టుకుంటూ కుటుంబాన్ని తీర్చి దిద్దుతుంది ఇల్లాలు. సహాయం కావలసి వచ్చినప్పుడు దానికోసం పిల్లల్ని, ఇరుగు పొరుగుని, బంధువుల్ని పురికొలుపుతుంది. భర్త ఆదాయాన్ని గమనిస్తూ కుటుంబాన్ని సంబాళించుకుంటుంది. ఏరోజు కారోజు, ఏపూట కాపూట ముగించాల్సిన పనులను ప్లాను చేసుకుంటుంది. అద్దె ఇంట్లో ఉంటే సొంత ఇంటికోసం, ఎదిగివున్న కూతురి పెళ్ళికి దీర్ఘకాలిక ప్రణాళికలు ఏర్పరుస్తుంది. తనమీద పడ్డ సంసారాన్ని తీర్చిదిద్దే భారం దిగ్విజయంగా కొనసాగించుకోడానికి ఆవిడకున్న అవకాశాన్ని, ఆర్థిక స్తోమతను, లభించిన జన సహాయాన్ని సరిపెట్టుకుంటూ నిభాయిస్తుంది. అనుకోకుండా అపరాత్రివేళ బంధువులు దిగుతారు. వారికి తగినట్టుగా సపర్యలుచేసి వారిని తృప్తి పరచే గృహిణి నైపుణ్యాన్ని మనం ఊహించగలమా? వాస్తవంగా సామర్థ్యవంతమైన గృహలక్ష్మి సామర్థ్యవంతమైన మేనేజరు.

ఒక రోగికి హాస్పిటల్‌లో ఓపెన్ హార్టు సర్జరీ. ఆ సమయంలో పెద్ద డాక్టరుగారి నిర్వాహక చాతుర్యం అమోఘం, అద్భుతం. ఒక ప్రాణాన్ని రక్షించడానికి అనుచర వైద్య బృందానికి సమయానుకూలంగా సలహాలను ఇస్తూ ఉండాలి. రోగి పరిస్థితిని జాగ్రత్తగా పరిశీలిస్తూ ఉండాలి. ఆపరేషన్ సక్రమంగా నడపాలి కాబట్టి సమయానుకూలంగా చాకచక్యంతో నిర్వహించడం, పురమాయిస్తూ ఉండడం మేనేజిమెంటు ముఖ్య లక్షణం.

ఒక బిల్డింగ్ కంట్రాక్టర్ విషయం చూడండి. ఒకే సమయంలో ఎన్నో పనులు జాగ్రత్తగా చూసుకోవాలి. ఇటుక, సిమెంటు, కమ్ములు, కలప మొదలైన వస్తువులను పరిశీలించుకునే మెటీరియల్స్ మేనేజిమెంటు. తాపీ పనివాళ్ళు, మేస్త్రీలు, కూలీలు, ఆడ కూలీలు, స్కిల్డ్ లేబరు మొదలైనవారిని పురమాయించే హ్యూమన్ మేనేజిమెంటు.

"పేరు ప్రతిష్ఠలు లేని మంచివారి సత్క్రియలు భూమిని పచ్చగా సశ్యశ్యామలం చేసే భూగర్భ జలాల వంటివి."

అనుకున్న ప్రకారం సకాలంలో నిర్మాణం పూర్తి కావడానికి టైమ్ మేనేజిమెంటు. వడ్రంగులు, ప్లంబర్లు ఎలక్ట్రిషియన్లు మొదలైనవారిని సమన్వయపరచే కాన్ఫిక్



మేనేజిమెంటు. ఇవే రకరకాల మేనేజి మెంటు అంటే.

సాంప్రదాయకంగా ఉండే స్వంతదారుని మేనేజిమెంటుతనం పోయింది ఆ యా వృత్తులలో నైపుణ్యాన్ని పెంపొందించుకున్న సాంకేతిక నిపుణుల మేనేజిమెంటు ఇప్పుడు ఏర్పడింది.

మేనేజిమెంటులో విడివిడిగా అనేక రంగాలున్నాయి. ఉత్పత్తి, అమ్మకం, కార్మిక వర్గం ఏర్పాటు, ఆర్థిక వ్యవహారం, పబ్లిక్ రిలేషన్స్ మొదలైనవన్నీ పెద్ద పెద్ద సంస్థలలో, సంఘాలలో ఆయా ప్రత్యేక రంగంలో సామర్థ్యాన్ని అధికపరచి అభివృద్ధి పరచడం మేనేజరు చేయవలసిన పని.

ప్లాను చేయడం, నిర్వహించడం, నియంత్రించడం, మదింపు చేయడం, ఉత్సాహాన్ని కలిగించడం, నిర్ణయించడం, ప్రారంభించడం మొదలైన కార్యకలాపాలు మేనేజిమెంటు యొక్క ప్రాతిపదిక అంశాలు. మేనేజి మెంటు రంగం ఏదైనా లక్ష్యాలను సామర్థ్యంగా సాధించడానికి మేనేజరు కొన్ని ముఖ్య మార్గాలను అవలంబించాలి. సాధించవలసిన విషయాలను గమనిస్తూ వీటికి ఆర్థిక స్తోమత్, సాధన సదుపాయాలు ఎంతవరకు లభిస్తాయి, అవసరమైనప్పుడు అప్పటికప్పుడు అదనంగా వీటిని ఎంతవరకూ ఆయా పనులకు సరిపెట్టుకోగలం అనే విషయాలు ముందు వెనుకలు వివేకంగా ఆలోచించాలి. దీర్ఘకాలిక, అల్పకాలిక ప్రణాళికలను సక్రమంగా ముందుగానే ప్లాను చేసుకోవాలి. కాలయాపన లేకుండా ఎంత శీఘ్రంగా ఆయితే అంత త్వరగా ఆ యా ప్లానులను చేపట్టాలి. ప్రతి పనికి టైమ్ షెడ్యూలు మరచిపోకూడదు. విడివిడిగా ఆ యా పనులకు ఆ యా వ్యక్తులను పురమాయిస్తూ ఉండాలి సక్రమంగా పని ఎంతవరకు సాగింది, ఇంకా ఎంతపని మిగిలి ఉంది అనే విషయాలు గమనిస్తూ ఉండాలి. దీనివల్ల ఆ యా పనులను సక్రమంగా నిర్వహించుకుంటూ సాధన సంపత్తులను నియంత్రించుకుంటూ ఉండవచ్చు. అతి నైపుణ్యంతో చాకచక్యంగా మేనేజరు ఉద్యోగస్తుల మధ్య పరస్పర సమాచార సంపర్క విధానాన్ని అభివృద్ధి పరచుకుంటే ఇంకా ఏం చేయాలి, ఎంత వరకు పని సాగింది అనే విషయాలు అవగత మవుతూంటాయి. ఒక పరిశ్రమలో

"సర్వోత్కృష్టమైన రాజ్యంలో కూడా ప్రభుత్వం అత్యవసరమైన ఉపద్రవం. నిరోధించినప్పుడు భరించలేం." —థామస్ పెయిన్

సాధించినవి, సాధిస్తున్నవి, సాధించగలిగేవి నాయకుడిని బట్టి ఉంటాయి.

ఎక్కడైనా, ఎప్పుడైనా, ఏదైనా లోటు ఏర్పడితే పనివాళ్ళకు కాదు నాయకుడు అనిపించుకునే లీడరుకే ముప్పు. మేనేజిమెంటులో మానవత్వం ముఖ్యం. పైకి అందరూ ఒకే మోస్తరుగా కనిపిస్తారు. మానసిక ఉద్రేకాలనుబట్టి, వారి వారి నైజాలను బట్టి ఎవరికివారే వేరువేరుగా కనిపిస్తారు. చాలాసార్లు ఒకే వ్యక్తి వివిధ పరిస్థితులలో రకరకాలుగా ప్రవర్తిస్తారు.



శారీరకంగా పరిరక్షణ, ప్రేమ, ఆత్మగౌరవం, అహంభావం మానవుని సహజ లక్షణాలు. చిన్న చిన్న బహుమతులకు కొందరు తృప్తిపడతారు. పనిలో ఎక్కువ అభిలాషను చూపిస్తారు. ఊరికే భుజంమీద చేయివేస్తే చాలు కొందరిలో ఉత్సాహం కలుగుతుంది వ్యక్తులందరూ ఒకే సమంగా ఉండరు కాబట్టి వారి వారి మనస్తత్వాలకు అనుగుణంగా ప్రవర్తించవలసిన బాధ్యత మేనేజరుది. కార్మికులందరితోనూ కలుపుగోరుతనంగా ఉండి ఒక సామూహిక వాతావరణాన్ని నిర్మించుకోవాలి. అత్యల్ప నష్టంతో ఉత్పాదకాభివృద్ధిని కలిగించడం సామర్థ్యవంతమైన మేనేజరుకి నైపుణ్యంతో వీలవుతుంది.

ఇక సామర్థ్యవంతమైన మేనేజిమెంటుకి నాయకత్వం, సంపర్కం, పురమాయింపు ముఖ్యమైనవి. అభిలషించిన లక్ష్యాలను సాధించడానికి ఈ లక్షణాలన్నీ మేనేజరుకి ఉండాలి.

మహాభారతంలో మంచి సమర్థత గల మేనేజరు శ్రీకృష్ణభగవానుడు. ఉత్సాహంతో చైతన్యంతో నిర్ణయాలు తీసుకున్నాడు. పరిష్కారం చేశాడు. వాస్తవంగా స్వంతంగా చేసిన పని ఏమీ లేదు ఒక సూత్రధారుడుగా నటించాడు. చేయదలచుకున్నవన్నీ సక్రమంగా సఫలంగా ఇతరుల చేత చాడు.

ఆధునిక మేనేజరుకి దివ్యోపదేశం, గీతోపదేశం. శ్రీకృష్ణభగవానుడు కార్యసాధకుడైన నాయకుడు, రాయబారి, సంధి కుదిర్చినవాడు. విసుగులేకుండా విన్నాడు. రథం నడిపించాడు. అతి చాకచక్యంగా భారత యుద్ధాన్ని కొనసాగించాడు. విజయాన్ని సాధింప చేశాడు.

మేనేజిమెంటు అనుకునేటంత సులభం కాదు. కంటకమయమైన రోజాపువ్వు వంటిది. ఏదో విధంగా మనం అంతా మేనేజర్లమే. ఇతరులను మేనేజ్ చేయకపోతే కనీసం మనల్ని మనం మేనేజ్ చేసుకోవాలి.

"దైవం మీద ఎంత గాఢ విశ్వాసమున్నా నిన్ను నీవు విశ్వసించ లేకపోతే ముక్తి శూన్యం. -స్వామి వివేకానంద

# తీరికసమయాల్లో అద్భుతసాధనలు

ఎస్. వి. మోఘె

వస్తువుల ధరలు విపరీతంగా పెరిగిపోయి ఆకాశాన్ని అంటుతున్నాయి. రూపాయి విలువ పడిపోయింది. కష్టపడి సంపాదించు కున్న సొమ్ము ఖర్చుపెట్టాలంటే మరోసారి కాదు ఇంకోసారి కూడా ఆలోచిస్తాం. కాని లభిస్తున్న అమూల్యమైన కాలం ఏ రోజు



అబ్రహాం లింకన్

కారోజు హరించిపోతూఉంటే ఏమైనా ఖాతర చేస్తున్నామా? పొద్దున్న లేచినప్పటి నుంచి రాత్రి పడుకునే దాకా ఎంత కాలాన్ని వృధా చేసుకొంటున్నామో నిజంగా నమ్మలేకుండా ఉన్నాం. మన నిత్య కార్యకలాపాలకూ, జీవనోపాధికీ విలాసానికీ, విశ్రాంతికీ విని యోగించే కాలం అటుంచి ప్రతీరోజూ మనం ఎన్నో గంటలు ఊరికే కాలయాపన చేసే స్తున్నాం. ఒక్కసారి జారిపోయిందంటే పోయినట్టే. తిరిగిరాదు ఈ కాలం!

"పోయింది! నిన్నటి రోజున సూర్యోద యం సూర్యాస్తమయం మధ్య ఎప్పుడో అరవై అమూల్య 'నిమిష' వజ్రాలతో పొదిగిన రెండు స్వర్ణమయ ఘటికలు - పారి తోషికం ఇవ్వబడదు. పోయినది పోయి నట్టే!" అని వాపోయింది శ్రీమతి సిగార్నే. శామ్యూల్ స్మైల్స్ (Samuel Smiles) "పోయిన సౌభాగ్యం పరిశ్రమాభివృద్ధితో తిరిగి పొందవచ్చు, పోయిన జ్ఞానం తిరిగి అధ్యయనం చేసి పొందవచ్చు: పోయిన ఆరోగ్యం ఔషధం సేవించి తిరిగి తెచ్చుకో

## వివాహాలలో అద్దెకు జనం

పెళ్ళికి పందిళ్ళు, షామియానాలు, దీపాలు, తివాసీలు, వంట సామానులు మొదలైనవి అద్దెకు దొరికినట్లే రాజస్థాన్‌లో వరునివైపు ఊరేగింపుకు పట్టుబట్టలు ధరించి బాగా అలంకరించుకున్న జనం కూడా అద్దెకు లభి స్తారు. దీనివల్ల వరునివైపు వారికి ఎక్కు వగా ఖర్చుపెట్టి చుట్టుపక్కల ఊళ్ళ నుండి బంధువులను కూడదీసుకువచ్చే అవసరం ఉండదు.

"ధర్మము, సత్యము, కీర్తియు, నిర్మలదయ నిష్ఠుర శక్తి నిరుపమ ఘనస త్కర్మమహింసా వ్రతమును, నర్మిలి గల్గవారె పుణ్యు లవనీనాథా." — భాగవతం

వచ్చు. కాని గతించిన కాలం తిరిగి రాదు" అన్నాడు.

మనతో సమానమైన మరొకరు బాగా అభివృద్ధిపొందుతుంటే ఆశ్చర్యపడి పోతాం. కాని మనకు జ్ఞాపకమే ఉండదు. మరచి పోతాం. పేకాడుతూ, కబుర్లు చెప్పుకుంటూ మనం కాలహరణం చేస్తూంటే, అతడు అర్ధ రాత్రిదాకా చదివేవాడు. తీరిక సమయాల్లో జ్ఞానాభివృద్ధిని కలిగించుకునేవాడు. పై పరీక్షలే కాకుండా ఇతర పరీక్షలు పాసవడం కోసం పాటుపడేవాడు. ఇలాగే మరికొందరు అసలు ఉద్యోగానికి తోడు, తీరిక సమయాలలో పార్టు టైము ఉద్యోగాలు చేసి ఆదాయాన్ని పెంపొందించుకుంటారు.

ప్రతిచోటా ఎక్కడచూచినా కాలహరణం చేసుకునేవాళ్లే అమూల్యమైన కాలాన్ని లాభ కరంగా సద్వినియోగం చేసుకోడానికి ఎంతో శ్రమపడాలి. కృతనిశ్చయం ఉండాలి. ఎంతో మంది కాఫీకోసం, టీకోసం, భోజనంకోసం, బస్‌కోసం కాచుకుని ఉండే సమయాల్లోగాని, నిత్య కార్యక్రమాల మధ్య దొరికే చిన్న చిన్న అవకాశాలలోగాని అనేక క్రొత్త క్రొత్త విష యాలను తెలుసుకోడమేగాకుండా క్రియా సాధకమైన పనులు కూడా చేసి ఘనతను పొందారు.

మేసన్ గోడ్ (Mason goad) లండ

## భూమి మీద సంభవించిన అతి పెద్ద ధ్వని



వెసూవియస్ అగ్నిపర్వతం పగిలి ఇటలీలో పాంపీ పూర్తిగా బూడిదతో కప్ప బడిపోయిన 1800 సంవత్సరాల అనంతరం అగస్టు 27, 1883న కారకోటా అగ్ని పర్వతం పగిలి మిక్కిలి భయంకర ధ్వనిని కలిగించింది. ఇప్పుడు ఇండోనేషియా అని చెప్పబడే తూర్పు దీవులలో కారకోటా ద్వీపం ఈ దెబ్బదికి పూర్తిగా ఎగిరి పోయింది. ఈ భయంకర ధ్వని 3000 మైళ్లు దాకా వినిపించింది. రాళ్ళు, బూడిద, దుమ్ము ఆకాశంలోకి 17 మైళ్ళ ఎత్తు పైకి లేచాయి. ఈ అగ్నిపర్వతం బ్రద్దలవడం వల్ల సము ద్రంలో లేచిన 50 అడుగుల ఎత్తు పెద్ద కెరటం వల్ల చుట్టు ప్రక్కల ద్వీపా లన్నీ నశించిపోయాయి 5,100 మైళ్ళ దూరంలో ఉన్న కేప్‌టౌన్ దగ్గరకు వచ్చేటప్పటికి ఆ కెరటం ఎత్తు అప్పటికి ఇంకా ఒక అడుగు ఎత్తు ఉంది. వాతావరణం అంతా దుమ్ముతో కప్పబడిపోయి ప్రపంచం అంతటా సంధ్యా సమయంలా కనిపించింది. కారాకోటాలో ఈ అగ్ని పర్వతం వల్ల ఏర్పడ్డ ఫలితాలు ఇంగ్లండులో లండన్ దాకా అనేక నెలల పాటు ఉన్నాయి.

"నీవు పోగొట్టుకోగల దానిని మాత్రమే అప్పుగా ఇవ్వు."

వలో రోగులను చూడడానికి వెళ్లేటప్పుడు "లూక్రేషియస్" (Lucretius) అనువదించాడు. వాట్ (Watt) కంపాస్, ప్రొట్రాక్టర్, స్కేళ్లు మొదలైనవి తయారుచేస్తూ, వ్యాపారం కొనసాగించుకుంటూ గణితం, రసాయనశాస్త్రం అభ్యసించాడు. మాంచెస్టర్ (ఇంగ్లండ్)లో చిన్న చిన్న పనులు చేసే కుర్రాడు ఒకడు లాటిన్, ఫ్రెంచి భాషలను అద్భుతంగా నేర్చుకున్నాడు.

హెన్రీ కిర్క్ వైట్ (Henry kirk white) చదువుకునే రోజుల్లో లాయరుగారి ఆఫీసుకు వెళ్ళివచ్చేటప్పుడు ప్రతి రోజూ దారిలో గ్రీకు భాష అవలీలగా నేర్చుకున్నాడు. గుర్రంమీద స్వారీచేస్తూ. డా. బర్నే (Dr. Burney) ఇటలీ, ఫ్రెంచి భాషలు నేర్చుకున్నాడు. జడ్జిపని చేస్తూ మేథ్యూ హేల్ (Matthew Hale) సర్క్యూటుకు వెళ్లేటప్పుడల్లా 'కాంటెంప్లేషన్స్' (Contemplations) రచించాడు. లింకన్ సర్వే చేస్తూ తీరిక సమయాలలో న్యాయశాస్త్రం అభ్యసించాడు. మైకేల్ ఫారడే పుస్తకాల బైండింగ్ చేసుకుంటూ అప్పుడప్పుడు ఎక్స్పెరిమెంట్లు చేస్తూ ఉండేవాడు. ఈస్ట్ ఇండియా హౌస్‌లో గుమాస్తాగా పనిచేస్తూ జాన్‌స్టూవర్ట్ మిల్ ఉత్తమ గ్రంథాలను రచించాడు. తోటలో వ్యవసాయం చేసుకుంటూ బర్న్స్ (Burns) అందమైన పద్యాలు ఎన్నెన్నో వ్రాశాడు. లాంగ్‌ఫెలో ప్రతిరోజూ కాఫీ వేడెక్కేదాకా పదేసి నిమిషాల పాటు 'ఇన్ఫెర్నో' (Inferno) అనువాదం చేస్తూ కొన్ని ఏళ్ళకు ముగించాడు.

తీరిక సమయంలో జ్ఞానాభివృద్ధికి పాటుపడడమో, ఏదైనా మంచి హాబీ అలవాటు చేసుకోడమో, క్రియాసాధకమైన పని కొనసాగించడమో; లేకపోతే ఉల్లాయి పాటలు పాడుకుంటూ కబుర్లు చెప్పుకోడమో, అధిక ప్రసంగం చేయడమో, పేకాడుకోడమో, ఆకతాయిగా తిరగడమో మనమే నిశ్చయించుకోవాలి. ఒక వ్యక్తియొక్క స్నేహితులను బట్టి, చదివే పుస్తకాలనుబట్టి తీరిక సమయాలలో ఆ వ్యక్తి వ్యవహరించే తీరునుబట్టి - ఆ వ్యక్తి యొక్క స్వభావాన్ని తెలుసుకోగలుగుతున్నాం.

మన అవకాశాలను సద్వినియోగం చేసుకుని మనం కూడా ఎందుకు అభివృద్ధి పొందకూడదు?

## అమెరికాలో ఎగిరే ఉడుతలు



అమెరికాలో ఎగిరే ఉడుతలు ఉన్నాయి. ఇవి రాత్రిపూట ముందు పాదాలకు వెనుక పాదాలకు అంటి ఉండే ప్రత్యేక చర్మపు పొర సహాయంతో ఒక చెట్టుమించి మరో చెట్టు మీదికి ఎగురుతాయి.

"మూఢ విశ్వాసం మానసిక విషం." —జోసెఫ్ బాయిన్

(16 వ పేజీ తరువాయి)

వాదించటానికి ప్రయత్నించకు. ఇతరులు చెప్పేది, వాదించేది శ్రద్ధగా-ఓపికగా విను. ఇతరులనుండి, వాళ్ళు పసిపిల్లలైనా సరే— మనం నేర్చుకోవలసినది ఎంతో ఉంటుంది.

ఏ యే పనులు ఎప్పుడెప్పుడు చేయాలో నిర్ణయించుకుని శ్రద్ధగా ముగించుకో. లేకపోతే మీ పరిస్థితులు, మీ పొరుగువారి పరిస్థితులు మారిపోతాయి. రైలు మించిపోతుంది. ముఖ్యంగా సాధించవలసిన లక్ష్యాన్ని కేంద్రీకరించుకుని చేయవలసిన విధాయిక ధర్మాలు అన్నీ అవరించుకుని ఉంటాయి. ముఖ్య లక్ష్యం మీద ఏకాగ్రత వహించు. ఇతర ధర్మాలన్నీ ముఖ్య ధర్మాన్ని నిర్వర్తించుకో డానికి దోహదకారులు అని గ్రహించు.

ఆధ్యాత్మిక జీవనంలో ఎన్నెన్నో గుణపాఠా లున్నాయి. కేవలం అభ్యసించడంవల్ల విజ్ఞానం వృద్ధిపొందదు. యదార్థమైన అంతరిక జీవితం జీవించడానికి విజ్ఞానం ఎంత మాత్రం సహాకరించదు. నేర్చుకుంటే చాలదు. నేర్చుకున్న దానిని అనుసరించాలి. అలా అనుసరించకపోవడం శుష్క వేదాంతం.

నమ్రత, వినయం, పవిత్రత, నిరహంకారం, ఉత్సాహం మొదలైనవి ఆధ్యాత్మిక ప్రగతికి లక్షణాలు. అహంకారం, గర్వం, అపవిత్రత, మోహం, ఉద్వేగం, ఉద్రేకం మొదలైన గుణాలు ఆధ్యాత్మిక పతనానికి లక్షణాలు. స్వాభిమానం వదలుకోవాలి. ఆధ్యాత్మికాభిమానం కూడా వదలుకోవలసిందే. సవ్యసించడం ఆధ్యాత్మికత అనిపించుకోదు తలలు బోడులైనా తలపులు బోడులు కావు. బాహ్యబంధాలను వదల్చుకున్నా మానసిక అభిలాషలకు లొంగిపోతావు. గీతలో చెప్పినట్టు అహంకార రహితుడవై, ఫలాసక్తిని త్యజించి, ఈశ్వరార్పణ బుద్ధితో పనులను చేసుకోవాలి. అనవసరంగా మథన పడి పోవద్దు. రానిది రాదు. పోనిది పోదు.

నీ కష్టసుఖాలు ఇతరులకు చెప్పుకుంటే వారు నీకు ఏదో వెలగబెడతారు అనుకోవద్దు. నీవు చెప్పుకున్న వారిలో సగంమంది నీ సంగతే పట్టించుకోరు. మిగిలిన సగంమంది నీ కష్టాలను చూచి సంతోషించే వారే.

## చంద్రుని వ్యాసం 2,163 మైళ్లు



సౌర కుటుంబంలో చంద్రుడు పెద్ద ఉపగ్రహం. దీని వ్యాసం 2,163 మైళ్లు. న్యూయార్కు, కాలిఫోర్నియాల మధ్యగల దూరం కంటె కొంచెం తక్కువ. భూమి అర్ధ వ్యాసంలో నాలుగవ వంతు. భూమికి 238,850 మైళ్ళ దూరంలో ఉన్న చంద్రుడు ఒక్కసారి తన చుట్టూ తాను తిరగడానికి 27 1/3 రోజులు పడుతుంది.

# బహుమతి పొందిన వ్యాసం

## ఆరోగ్యం జన్మహక్కు

ఎస్. రాజేశ్వరి, శ్రీశైలంప్రాజెక్టు.

'ఆరోగ్యమే మహాభాగ్యం'. ఈ విశాల ప్రపంచంలో ఎదురయే ఎలాంటి సంఘటనలను అయినా ఎదుర్కోడానికి మానవుడు సంసిద్ధుడై ఉండాలి. ఆరోగ్యాన్ని మించిన సంపద ఈ సృష్టిలో మరొకటి లేదు. ఆరోగ్యం దేవుడు ఇచ్చిన వరం. దానిని మానవుడు సద్వినియోగం చేసుకోడం లేదు. ప్రతివ్యక్తి తన ఆరోగ్యాన్ని కాపాడుకుంటే శారీరకంగా, మానసికంగా, ఆధ్యాత్మికంగా జీవితంలో తృప్తిని, ఆనందాన్ని అనుభవిస్తాడు.

ఆరోగ్యం ప్రకృతిలో ప్రతీ విషయం మీద - ముఖ్యంగా మనం భుజించే ఆహారం మీద-ఆలోచనలమీద ఆధారపడి ఉంది. ఆరోగ్యం సగపాలు మన ఆలోచనలమీద, కోరికల మీద ఆధారపడి ఉంటుంది. ఉన్నదాంతో, దొరికినదాంతో జీవితంలో సర్దుబాటు చేసుకోడం ఆరోగ్యాన్ని కాపాడుకోడానికి సాధనం. స్వచ్ఛమైనగాలి, నీరు సేవించడం, క్రమబద్ధమైన జీవితాన్ని గడపడం ఆరోగ్యానికి సోపానాలు.

ఆధునిక మానవుడు ఎంత ప్రగతిని పొందినా మరణంనుండి కాపాడబడుట లేదు. మనిషికి జన్మ ఎంత సహజమో మరణం కూడా అంత సహజం. అకాల మృత్యువు నుండి, జీవన స్రవంతిలో ఆటుపోట్ల నుండి తట్టుకొనుటకు ముందు ఆరోగ్యవంతుడై ఉండాలి. ఆరోగ్యానికి, అందానికి అవినాభావ

---

### అంటార్కిటిక్ ఖండంలో మిక్కిలి ఎత్తైన పర్వతాలు ఉన్నాయి



అంటార్కిటిక్ ఖండంలో 14.000 అడుగుల ఎత్తుకు మించిన కొండలు 2 మైళ్ళ దళసరి మంచుతో పేరుకుపోయిన ప్రాంతంలో ఉన్నాయి.

"అన్ని కష్టాలకు లోభం కారణం. సంతుష్టి కంటే స్వర్గం లేదు."

సంబంధం ఉంది. మనిషి ఆరోగ్యంగా ఉంటే ఆ వ్యక్తి అందంగా కనిపిస్తాడు. ఏ దేశంలో ప్రజలు ఆరోగ్యవంతులై ఉంటారో ఆ దేశం సిరిసంపదలతో తులతూగుతూ ఉంటుంది. ఆరోగ్యం సంతోషానికి, మనోవికాసానికి మూలం.

ఆధునిక వైజ్ఞానిక యుగంలో కొన్ని వ్యాధులు వంశ పారంపర్యంగా వస్తాయి. అలాటి వాటిని నివారించుకోవాలి. వివాహ సంబంధాలు-మరీ దగ్గర రక్తసంబంధాలు, మేనరికాలు కాకుండా - చూసుకుంటే కొంత వరకు కాపాడుకోగలుగుతాం.

ఈనాడు లభించే మంచినీరు, గాలి సహితం కలుషితం అయిపోతూంది. ఈ కాలుష్యాలను సాధ్యమైనంతవరకు తగ్గించుకోవాలి ఆరోగ్యంవల్ల కలిగే లాభాలు మానవుడు పొందాలి అంటే ఆరోగ్యాన్ని జన్మహక్కుగా భావించక తప్పదు.

* * *

వి.ఎమ్.సుధాకర రెడ్డి, ప్రొద్దుటూరు.

'స్వాతంత్ర్యం నా జన్మహక్కు'. ఇది నాటి దేశ స్వాతంత్ర్య సమరంలో ప్రజల నినాదం. వాతావరణ కాలుష్యం కమ్ముకున్న ఈనాడు 'ఆరోగ్యం నా జన్మహక్కు' అని నినాదం చేయవలసివస్తూంది.

మానవుడు సహజంగా ఎప్పుడూ ఆరోగ్యంగా ఉండాలని కోరుకుంటాడు. వాతావరణ కాలుష్యంవల్ల అనారోగ్యం కలుగకుండా చూచుకొనడం గగనమౌతూంది. ఎన్ని సంపదలు ఉన్నా అనారోగ్యానికి నిరుపయోగాలు. ధర్మార్థ కామమోక్ష సాధకమైన శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచుకోడం మన కర్తవ్యం. ఆరోగ్యమే మహాభాగ్యమన్నారు. ఆరోగ్యంగా ఉండాలంటే ముఖ్యంగా కొన్ని నియమాలను పాటించాలి. అన్ని విషయాలలోను మితాన్ని అనుసరించాలి మిత ఆహారం, మిత నిద్ర, మిత వ్యాయామం, మిత సంభాషణ.

బాగా వెలుతురు, గాలి ప్రసరించే ఇళ్ళలో నివసించాలి. పరిసరాలు ప్రశాంతంగా, పరిశుభ్రంగా ఉండాలి. ఉన్నంతలో పరిశుభ్రతను

## ప్రపంచంలో మిక్కిలి విలువైన రహదారి



న్యూగినియా అడవుల గుండా ఏర్పాటైన 2 మైళ్ళ పొడవు దారి ప్రపంచంలో మిక్కిలి ఎక్కువ ఖర్చుతో ఏర్పాటైంది. దీని నిర్మాణంలో ఇంజనీర్లు కనిపించిన రాళ్ళనన్నిటినీ ఉపయోగించారు. గట్టిపడిన తరువాత చూస్తే రోడ్డు ఎండలో ధగధగ మెరిసింది. 10 లక్షల డాలర్ల విలువగల బంగారం అందులో ఉన్నట్లు తెలుసుకున్నారు.

"మంచితనం, ప్రేమ, విశ్వాసం, పరితాపం ఉన్న తోటి దేవుడు ప్రత్యక్షమవుతాడు."

పేర్చరచుకోవాలి. ఆరోగ్యంగా ఉండటానికి ఆసనములు వేయటం ఒక పద్ధతి.

శరీరానికి తగినంత విశ్రాంతి ఇవ్వటం ఆరోగ్యానికి మూలం. విశ్రమాని అతిగా సినీమాలు చూడరాదు. ఉద్రేకాన్ని కలిగించే పానీయాలను త్రాగరాదు.

కాలుష్యాలను పెంచే పరిశ్రమలస్థాపనలో ప్రభుత్వం జాగ్రత్తవహించి వాటిని జనావాసములకు దూరంగా స్థాపించాలి. 'ఆరోగ్యమే మహాభాగ్యం' అను లోకోక్తికి అనుగుణంగా 'ఆరోగ్యం నా జన్మహక్కు' అనుకుని దానికి కావలసిన కృషిచేస్తే మానవులు సుఖసౌఖ్యాలను అనుభవించవచ్చు.

• • •

ఎ. జోయాకుమారి, ఉయ్యూరు.

ఆరోగ్యం ఆనందానికి మొదటిమెట్టు. మానవజీవిత పరమావధి ఆనందాన్ని పొందటమే. 'ఆనందో బ్రహ్మ' అన్నారు.

మనిషి నిత్యం తను చేసేపనులలో తనకు కలిగే సుఖాన్ని, ఆనందాన్ని దృష్టిలో పెట్టుకుని చేస్తాడు. కాని చాలసార్లు ఆ పనుల్లో విఫలుడై నిరుత్సాహపడతాడు. కాబట్టి చేయవలసిన పనిలో ఆసక్తి, పట్టుదల, ఉపాయం, మొదలైనవాటిని సరిగా వినియోగించుకోవాలి

ఏ పనిని చేయాలన్నా ముందు శారీరకంగా శక్తి అవసరం. మంచి శారీరక శక్తిని పొందాలంటే ఆరోగ్యం అవసరం. శరీరానికి ఏ దుర్గుణాలు లేకుండా పుష్టికరమైన ఆహారాన్ని తీసుకోవాలి. చక్కని వ్యాయామం చేయాలి. మానసిక నైర్మల్యం కాపాడుకోవాలి. ఉన్నతమైన ఆలోచనలు, ఉత్సాహభరితమైన జీవితం ఆరోగ్యానికి దోహదాలు. అందువల్ల జరిగేవన్నీ మంచికనే అనుకోవడమే మనిషి పని జరిగినవాటికి చింతించక అనుభవాలను విజయాలకు మెట్లుగా తీసుకుని ముందుకు సాగాలి. చేసే పనులను ఉత్తమమైనవిగా, పరులకు ఉపయోగపడేవిగా, అందరి శుభాన్ని కోరేవిగా మలచుకోవాలి. అప్పుడే జీవితంలో మనిషికి తృప్తి, ఆనందం కలుగుతుంది. అదే ఆరోగ్యమైన జీవితం.

ఆనందానికి మూలం ఆరోగ్యం. ఆరోగ్యానికి మూలం ఆనందం. ఆహార విషయాలలో నియమాలను పాటిస్తూ సమయాన్ని సద్వినియోగపరుస్తూ శారీరక, మానసిక దుర్గుణాలను దరిచేర నీయకుండా జాగ్రత్త వహించాలి. ●

## 10 వేల లక్షల కోడిపెట్టలు



ప్రపంచంలో ఎలా లేదన్నా 10,000 లక్షల కోడిపెట్టలున్నట్టు అంచనా. వీటి తరువాత స్థానం పిచ్చుకలది.

(మిషా పొజన్యంతో)

# ఔషధ ప్రపంచం

మలేరియాకు క్రొత్తమందు:

మలేరియాకు ఫ్లోక్విన్ (Floquine) అనే క్రొత్తమందు కనుగొనబడింది. దీనిని ప్రపంచ ఆరోగ్య సంస్థ (world health



organisation) గుర్తించింది. క్వినైన్‌కి బదులుగా దీనిని వాడవచ్చు. ప్రపంచంలో కొన్ని కొన్ని ప్రదేశాలలో క్వినైన్ అంతగా పనిచేయడంలేదు.

• • •

రొమ్ము క్యాన్సర్‌కి 'రేడియేషన్' వైద్యం:

రొమ్ము క్యాన్సర్‌ను కుదర్చడానికి క్రొత్తరకం రేడియేషన్ వైద్యం పశ్చిమ దేశాలలో చాలా ప్రచారంలో ఉంది. దీనివల్ల రొమ్ముకు శస్త్ర చికిత్సగాని, రొమ్మును తీసివేసే అవసరంగాని ఉండదు. ఈ వైద్యంలో రోగి మీదికి ప్రతి దినం కొద్ది నిమిషాలపాటు కొబాల్ట్ (రేడియేషన్) కిరణ ప్రసరణం చేయబడుతుంది. ఇది ఆరు మొదలు ఎనిమిది వారాలపాటు సాగాలి. రొమ్ములో గడ్డ

# పాఠకుల అభిప్రాయాలు

(జూలై 1986)

"చదువు 'కొంటాము' అనేవారికి ఉన్నదిసీటు
చదువు 'కుంటాము' అనేవారికిలేదు సీటు."

—ఎన్. రాజశేఖర్, ఇల్లందు.

"పుణ్యకార్యం చేద్దామంటే....
పాపం ఎదురుగ వస్తోంది!"

—వడాల శివశంకర మూలారెడ్డి, విజయవాడ.

• • •

"పరీక్షల్లో మార్కులు బాగా రాకపోతే,
ఈ కాలం టీచర్లు సరిగ్గా పాఠాలు
చెప్పరు అంటుంది అమ్మ,
పిల్లల చదువు విషయంలో తల్లిదండ్రులు
శ్రద్ధ తీసుకోరు అంటారు టీచర్లు."

—బి.ఎన్. మాధురి, ఒరిస్సా.

---

"జీవితం సుందరం అని నిద్రలో కలగన్నాను. జీవితం అనుసరించ వలసిన ధర్మం అని ప్రబుద్ధుడనై తెలుసుకున్నా."

గాని. క్యాన్సర్ సంబంధమైన ట్యూమర్‌గాని కోబాల్టు కిరణాలవల్ల కరిగిపోతుంది.

• • •

## శరీర వ్యవస్థలో బయో కరెంట్లను ప్రేరేపించే ఇంటిగ్రల్ సర్క్యూట్:

రష్యాలో లాట్వియాన్ నిపుణులు మానవ శరీర వ్యవస్థలో సహజంగా ఉండే బయోకరెంట్లను ప్రేరేపించడానికి ఇంటిగ్రల్ సర్క్యూట్ విధానాన్ని తయారు చేశారు. సాధారణ విద్యుత్ వల్ల ఆరోగ్యకరమైన అస్థి విభాగాల నుండి సున్నపు పదార్థాలు కొట్టుకు పోకుండా రక్షింపబడతాయి ఎముకల టిష్యూలను ఈ విధంగా ప్రేరేపించడం వల్ల చికిత్సా కాలం తగ్గి శీఘ్రంగా పునరుజ్జీవింపబడతాయి.

## గుండెపోటుకు క్రొత్తరకం వైద్యం:

డా. కె ఎల్. చోప్రా బృందంచే తొలిసారిగా దేశంలో గుండెపోటుకి క్రొత్త రకం వైద్యం విజయవంతంగా ప్రయత్నింపబడింది. చేతి రక్త నాళాలగుండా 'స్ట్రెప్టోకైనేస్' (Streptokinase) అనే మందును పంపి నూటికి 90 శాతం గుండెపోటుకు కారణమైన గుండె ఆర్టెరీలలో గడ్డ (Clot) ను కరిగింపజేస్తారు. రోగికి గుండెపోటు ప్రారంభించిన 6 గంటలలోగా - అంటే గుండె ఆర్టెరీలలో పూర్తిగా రక్తం గడ్డకట్టకముందే ఈ వైద్యం ప్రారంభిస్తే ఈ క్రొత్త చికిత్సవల్ల మంచి ఫలితాలను పొందవచ్చు.

• • •

## జ్ఞాపకశక్తి పెంపొందడానికి క్రొత్త మందు:

వృద్ధాప్యంవల్ల సాధారణంగా క్షీణించిన జ్ఞాపక శక్తిని పెంపొందించి, బుద్ధిని వికసింపజేయడానికి అమెరికా క్రిగ్‌టన్ యూనివర్సిటీకి సంబంధించిన పరిశోధక బృందం సేంద్రియ రసాయనిక సమ్మేళనాన్ని కనుగొన్నారు. ఇది వ్యాపారస్థులు, విద్యార్థులు తమ తమ పనులను బాగా కొనసాగించుకునేందుకు బుద్ధి మాంద్యాన్ని తొలగించి ఉత్తేజపరుస్తుంది.

## ప్రపంచంలో మిక్కిలి పొడవైన రోడ్డు



అమెరికా కాలిఫోర్నియాలో లాస్ ఏంజిల్స్‌లో ఉన్న ఫిగరో వీధి (Figueroa Street) ప్రపంచంలోనే మిక్కిలి పొడవైన రోడ్డు. ఉత్తరానగల పసాడెనా (Pasadena) మొదలు దక్షిణాన గల సాన్ పెడ్రో (San Pedro) వరకు ఉన్న ఈ రోడ్డు పొడవు 30 మైళ్ళు న్యూయార్క్ నగరంలో బ్రాడ్వే రోడ్డు పొడవు 16 మైళ్ళ పైచిలుకు.

"మనగడను అనుకునే రీతిగా మలచుకోడమే విజయం." —క్రిష్టఫర్ మార్లో

# చంద్రుని దగ్గరి దృశ్యం

రేంజర్, సర్వేయర్, ఆర్బిటర్ వంటి ఆధునిక అంతరిక్ష నౌకల సహాయంతో తీసిన ఫోటోలు భూమికి ఉపగ్రహమైన చంద్రునికి మిక్కిలి చేరువగా ఉన్న దృశ్యాలు.



రేంజర్ 7 మేఘాల సముద్రం (Sea of clouds) దగ్గరి ప్రదేశం 4,000 దృశ్యాలను భూమిమీదికి ప్రసారం చేసింది. వీటిలో కొన్ని దృశ్యాలు చంద్రునిపై ఏర్పడ్డ పెద్ద పెద్ద పల్లాలు (craters). ఆకాశంలో ఉల్కలు తీవ్రమైన శక్తితో చంద్రునిపై పడి ఢీకొన్నప్పుడు ఈ పల్లాలు ఏర్పడి ఉండవచ్చునని అంటారు.

సర్వేయర్ అంతరిక్ష నౌక తీసిన ఫోటోల వల్ల చంద్రుని ఉపరితలం తడి ఇసుక కణాలను పోలి ఉన్నట్టు తెలుస్తుంది. ఈ కణమయ పదార్థం అగ్ని పర్వతాల నుంచి వచ్చిన లావా వల్ల ఏర్పడినట్లు ఊహించబడుతూంది.

అంతరిక్ష నౌక ఆర్బిటర్ తీసిన ఫొటోలు 2 మొదలు 10 మైళ్ళు వ్యాసం గల గోపురాలను ప్రదర్శిస్తున్నాయి. కరిగిన శిలాద్రవం ఉబ్బి ఉపరితలాన్ని గోపురంలా చేసి ఉండవచ్చు.

చంద్రుని ధృవ ప్రదేశపు దృశ్యాలు కూడా ఆర్బిటర్ ఫోటోగ్రాఫులు తెలియజేస్తున్నాయి. చంద్రునికి అవలివైపు దక్షిణ ధృవప్రదేశం 150 మైళ్ళ పొడవు 5 మైళ్ళ వెడల్పు గల పెద్ద చెరువులా ఉంది. అనేక పల్లాలు చేరి ఇది ఏర్పడి ఉండవచ్చు. ●

(12 వ పేజీ తరువాయి)

కొబ్బరి నీళ్ల నుండి ఆల్కహాల్ పానీయం

కేరళ రాష్ట్రం కోకోనట్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ వారు కొబ్బరినీళ్ళనుండి 'కోకోనట్ ఫెనీ' అనే ఆల్కహాల్ పానీయం తయారుచేయడానికి ఒక నూతన ప్రణాళికను ఏర్పరచారు. ఎండు కొబ్బరి తయారు చేయడానికి ఏర్పరిచిన రూ. 1.5 కోట్ల ప్రాజెక్టులో చేరిన ఈ ప్రణాళిక ప్రకారం ఎండు కొబ్బరి తయారీలో వచ్చే నీటివి ఆల్కహాల్ పానీయంగా తయారు చేసారు.

---

"అస్తి పాస్తులను ఇస్తే ఇచ్చేది కొంతమే.
ఆత్మార్పణను మించిన దానం లేదు." —ఖలీల్ గిబ్రాన్

# మీకు తెలుసా?

**ప్రొఫెసర్ మహలనోబిస్ భారత దేశాన్ని ప్రపంచ పటంలో చేర్చాడు:**

కలకత్తాలో ఇండియన్ స్టాటిస్టికల్ సంస్థను స్థాపించిన ప్రొ. పి. సి. మహలనోబిస్ ప్రపంచ మేథమెటికల్ స్టాటిక్స్ పటంలో భారతదేశాన్ని ఎక్కించిన మేధావి.

• • •

**భారతదేశంలో హెలెన్ చీరను ప్రవేశపెట్టింది:**

ఇప్పుడు బీహారులోగల మగధను పాలించిన చంద్రగుప్త మౌర్యుని గ్రీసుదేశపు భార్య హెలెన్ భారతదేశంలో చీరను ప్రవేశపెట్టింది.

• • •

**మోటారు కాపిటల్:**

అమెరికాలో డెట్రాయిట్ నగరాన్ని 'ప్రపంచపు మోటారు కాపిటల్' (Motor capital of the world) అంటారు.

• • •

**విరమించుకున్న అమెరికా అధ్యక్షుడు:**

అమెరికా అధ్యక్ష పదవినుంచి విరమించుకున్న వారు రిచర్డ్ నిక్సన్ ఒకడు మాత్రమే.

**యూరప్ 'బ్లాక్ డెత్':**

ఈగలవల్ల సంక్రమించే ప్లేగ్ వ్యాధితో యూరప్‌లో సగానికి సగం పైగా జనం 1348-49 సం.లో మరణవాత బడ్డారు.

• • •

**గర్భదరిద్రుడుగా మరణించిన కొలంబస్:**

అమెరికాను కనిపెట్టిన సుప్రసిద్ధ క్రిస్టఫర్ కొలంబస్ 1504 వ సం.లో అమెరికాకు నాల్గవసారి ప్రయాణం చేసిన రెండు సంవత్సరాలకు గర్భదరిద్రుడుగా మరణించారు.

• • •

**జపానులో ముఖ్య మతాలు:**

షిన్‌టోమతం (Shintoism) బౌద్ధ మతం (Buddhism) జపానులో రెండు ముఖ్య మతాలు.

• • •

**మిక్కిలి ప్రశస్తి పొందిన నవల:**

ఎమిలీ బ్రాంటి రచించిన ఒకే ఒక నవల 'ఉదరింగ్ హైట్స్' (Wuthering Heights) మిక్కిలి ప్రశస్తిని పొందింది.

• • •

**ఆంగ్లభాషలో విస్తారంగా వాడబడే అక్షరం:**

ఆంగ్లభాషలో 'E' విస్తారంగా వాడబడే అక్షరం.

"విజయానికి కాదు యోగ్యతకు ప్రయత్నించు." — ఆల్బర్ట్ ఐన్‌స్టైన్

(8 వ పేజీ తరువాయి)

కొంతకాలానికి సంగీతస్వామి అనే ఒక యోగీశ్వరుడు యాత్రలు చేసుకుంటూ తంజావూరు రావడం తటస్థించింది. కాశీ క్షేత్రం నుంచి వచ్చిన ఆ స్వాములవారు తంజావూరులోనే చాతుర్మాస్యం గడుపుదున్నారు. భక్తి శ్రద్ధలతో ఊళ్ళో యోగికి భక్తులు భిక్షలు ఏర్పాటు చేస్తున్నారు. విశ్వనాథ శాస్త్రిగారింట్లో కూడా భిక్ష ఏర్పాటైంది. విశ్వనాథశాస్త్రి తన కుమారుడైన శ్యామకృష్ణుణ్ణి చూపి ఆశీర్వదించమని ఆ యోగిని వేడుకున్నాడు ఆ యోగి శ్యామశాస్త్రిలో అద్భుత సంగీతశక్తి ఉందని గ్రహించి. గొప్ప సంగీత శాస్త్రజ్ఞుడవుతాడని; సంగీతంలో గొప్ప పండితుడు కాగలడని తండ్రితో చెప్పాడు.

శ్యామశాస్త్రి యోగిపుంగవుడైన సంగీత స్వామివద్ద మిక్కిలి శ్రద్ధా భక్తులతో రాగ శాస్త్రాన్ని. తాళశాస్త్రాన్ని నేర్చుకుని సంగీత శాస్త్రంలోని రహస్యాలను తెలుసుకున్నాడు. సంగీతస్వామి తన దక్షిణదేశ యాత్రను పూర్తిచేసుకుని కాశీకి తిరిగి వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. ఆ సమయంలో తన దగ్గర ఉన్న అనేక అపూర్వ సంగీత శాస్త్ర గ్రంథాలను శ్యామశాస్త్రికి బహూకరించి, తంజావూరు ఆస్థాన విద్వాంసుడైన పచ్చిమిరియం ఆదిఅప్పయ్యగారి పరిచయం చేసుకుని వారి సంగీతాన్ని వింటూ ఉండమని చెప్పి వెళ్ళిపోయాడు. గురువుగారి ఆజ్ఞను అనుసరించి శ్యామశాస్త్రి ఆదిఅప్పయ్య స్నేహం చేసుకుని అతడి సంగీతాన్ని వింటూ తన సంగీత జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకున్నాడు. శ్యామశాస్త్రిపట్ల ఆదిఅప్పయ్యకు అమితమైన ప్రేమ, భక్తి. వాత్సల్యాభిమానాలతో 'కామాక్షి' అని పిలుస్తూ ఉండేవాడు.

తండ్రి మరణానంతరం కులదేవత ఆరాధన, కామాక్షీదేవి అర్చన శ్యామశాస్త్రి వహించవలసి వచ్చింది. శ్యామశాస్త్రి కామాక్షీదేవి ఉపాసకుడు, భక్తుడు. సాక్షాత్ కామాక్షీదేవి సాక్షాత్కరించి శ్యామశాస్త్రితో సంభాషించినట్లు చెబుతారు. ఇతడు అమ్మ

## భావపరిచయపోటీ

(జూలై 1985)

"స్వార్థంతో చేసే ప్రార్థన నిరర్థకం,
నిస్వార్థంతో చేసే ప్రార్థన సార్థకం."

—వి. జగదీశ్, వరంగల్.

• • •

"పిరిగలవాని భక్తిలో చూడండి రక్తి,
నిజమైన భక్తిగల బాలురలో చూడండి ముక్తి."

—ఎన్. రాజశేఖర్, ఇల్లిందు,
(ఖమ్మం జిల్లా)

• • •

"ఆత్మ శుద్ధి లేని భక్తి,
తెచ్చిపెట్టలేదు ముక్తి."

—ఎస్. మధుసూధనరావు, వసుంధర,
(శ్రీకాకుళం జిల్లా)

---

"ఈ లోకంలోని మహదానందం మనం ప్రేమించబడుతున్నామనే మహా విశ్వాసం నుంచి జనిస్తోంది." —విక్టర్ హ్యూగో

వారి ఉక్రవా
మైన పాటలు అప్రయత్నంగా పాడేవారట. అనేక కృతులను రచించాడు. ఇతని కృతుల వర్ణాలు, జతులు ఎంతో ప్రసిద్ధమైనవి. ముఖ్యంగా ఇతడి కీర్తనలన్నీ దేవీ స్తుతి పరంగా 'శ్యామకృష్ణుని సోదరి' అనే సంబోధనతో ఉంటాయి. క్షేత్రాటనగానీ, తీర్థయాత్రగానీ ఇతనికి అంతగా ఇష్టంలేదు. కాబట్టి వీరి జీవితం అంతా తంజావూరులో కామాక్షీదేవి నిత్యారాధనతో 'జననీ నతజన పరిపాలినీ పాహిమాం భవానీ' అంటూ సాగిపోయింది. శిష్యులు ఎక్కువ లేక పోవడంచేత ఈయన కీర్తనలకు అంత ప్రచారం లభించలేదు.

ఒకసారి మధురకు వెళ్ళినప్పుడు అప్పటి మీనాక్షీదేవీ ఆలయంలో దేవిని స్తుతిస్తూ తొమ్మిది అపూర్వమైన కీర్తనలు రచించాడు. ఈ తొమ్మిది కీర్తనలే శ్రీ శ్యామాశాస్త్రి 'దేవి నవరత్నమాలిక'గా మిక్కిలి ప్రశస్తి పొందాయి. 'సరోజదళనేత్రి', 'దేవి మీననేత్రి', 'నన్ను బ్రోవు లలిత', 'మీనలోచని బ్రోవ' మొదలైనవి చాలా ముఖ్యమైన కీర్తనలు. ఆనందభైరవి రాగంలో కీర్తనలను అధికంగా రచించాడు కాబట్టి ఇతడికి ఆనందభైరవి అభిమానపాత్రమైన రాగమని తెలుస్తుంది.

శ్యామశాస్త్రి తెలుగు, సంస్కృతంలోనే కాక తమిళంలో కూడా కొన్ని కృతులను రచించాడు. ఇతడు రచించిన కొన్ని కృతులలో రాగములపేర్లు కూడా ఉంటాయి.

తంజావూరు రాజాస్థానంలో అనేక విద్వాంసులను ఓడించాడు. అత్యంత గౌరవ ప్రతిష్ఠలను, కీర్తిని సంపాదించిన బొబ్బిలి కేశవయ్యను తంజావూరులోను, అప్పుకుట్టి అనే విద్వాంసుని నాగపట్టణంలోను ఓడించాడు. ఇతడు అతి సులభంగా సునాయాసంగా ఎంతో క్లిష్టమైన గమకాలు, తాళాలు గల కీర్తనలను రచించాడు. బొబ్బిలి కేశవయ్యను ఎదుర్కొనటానికి ముందు దేవిని పూజించి "దేవీ బ్రోవ సమయ మిదే" అనే కీర్తన రచించినట్లు కథ.

అనేక కారణాలవల్ల ఆంధ్రదేశాన్ని వదలి దక్షిణాదికి వలస పోయిన మహామహులు, విద్వాంసులు ఎందరెందరో వ్యవహారికంగా తమిళం మాట్లాడుకునేవారైనా తమ పూర్వాభిమానంతో లలితమైన తెలుగులో భాషాశిల్పం, సంగీత శిల్పం మేళవించి మిక్కిలి రమణీయంగా, సొగసుగా, సునాయాసంగా, మహోన్నతమైన భక్తిరస భావాలతో అనేక కీర్తనలను రచించి 'దేశ భాషలందు తెలుగు లెస్స' అని ప్రత్యక్షంగా ప్రకటించారు. —తాయూరి

## ప్రపంచంలో గర్భదరిద్రులు

మధ్యమిండనావో (ఫిలిప్పైన్స్) దీవులలో కొండవాసులైన టాసాడే జాతులు ప్రపంచంలోనే గర్భదరిద్రులు. వీరికి పెంపుడు జంతువులు లేవు. వ్యవసాయం లేదు. బట్టలు మొదలైన సాధన సంపత్తులు కూడా వీరికి లేవని 1971 సం. లో తెలుసుకొనబడింది

"సామాజికుల అభివృద్ధికి సమాజం కాని సమాజాభివృద్ధికి సామాజికులు కాదు." — హెర్బర్ట్ స్పెన్సర్

# పోటీలు

(సెప్టెంబరు 1985)

'విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పోస్టు కార్డు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీ మీదా అడ్రస్సు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రూ. 10 లు, రూ. 7 లు, రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎ కాలు) అంటించి పంపాలి. ఒక ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరుతేదీ: సెప్టెంబరు 20, 1985. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విస్డమ్", 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు-600 004.

—సంపాదకుడు.

## వ్యాసం

'నేటి సినిమాలు - నైతిక సాంస్కృతిక విలువలు' అనే అంశంమీద 300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## క్విజ్

1. 'దక్షిణ్ గంగోత్రి' అని ఈ క్రింది వాటిలో దేన్ని పిలుస్తారు? (ఎ) అంటార్కిటికాలో భారతీయ స్థావరం, (బి) క్రొత్త రాకెట్ (సి) కృత్రిమ ఉపగ్రహం, (డి) క్రొత్త యుద్ధనౌక.

2. భారత దేశంలో అత్యున్నతమైన శిఖరమేది?

3. పింప్రి క్రిందివాటిలో దేనికి ప్రసిద్ధి వహించింది? (ఎ) ఆంటీ బయోటిక్కులు, (బి) ఎరువులు, (సి) ఉక్కు, (డి) దేనికీ కాదు.

4. టాలో (Tallow) అంటే ఏమిటి?

5. భారతదేశ ఎటామిక్ ఎనర్జీ కమిషన్ ఛైర్మన్ ఎవరు?

6. 'ప్రజలయొక్క, ప్రజలచేత, ప్రజల కొరకు నియమింపబడిన ప్రజాప్రభుత్వము' అని చెప్పిన దెవరు?

7. భారతదేశంలో తొలి ఎటామిక్ పవర్ ప్లాంట్ ఎక్కడ స్థాపింపబడింది?

8. భారత అధ్యక్షుడు అస్వస్థతగా ఉన్నప్పుడు అధ్యక్ష పదవిని ఎవరు నిర్వహిస్తారు?

# పజిల్

ఆధారాలు - అడ్డం: 1. 'అంతా రామమయం ఈ జగమంతా రామమయం'. 'నను బ్రోవ మని చెప్పవే సీతమ్మతల్లి'.... మొదలైన భక్తరంజక కీర్తనలు రచించిన యోగి పుంగవుడు, భక్తశిరోమణి, 3. స్వప్నంలో ప్రబోధితురాలై తమ్మల దమ్మక్క అనే భక్తురాలు సీతా రామ లక్ష్మణ విగ్రహాలను ప్రతిష్ఠ చేసిన పవిత్ర యాత్రాస్థలం, 5. ఒక విధమగు ప్రయాణ సాధనము, 6. భరతుని వంశస్థులగు కౌరవ పాండవాదుల చరిత్రను తెలుపు పెద్ద గ్రంథం, 8. నీటి పారుదలకు ఏర్పరచే కృత్రిమ సౌకర్యం, 9. అప్పడాలతో పాటు భోజనములో నంజుకొను వ్యంజన విశేషము, 10. సమానమైన వస్తువుల నిచ్చి దానికి బదులు పుచ్చుకునే ఇతర వస్తువులు అనే మాట మార్పుచెందినవి, 13. సాధారణంగా పెంపుడు కుక్కలు తోక ఆడించుకుంటూ—యజమాని కాళ్ళావేళ్ళా పడతాయి, 15. వదరుబోతు, మాటలమారి; 17. కలుగన్, సంభవింపక, తక్క మొదలైన అర్థమిచ్చే ఒక అవ్యయము 'నే నె— ఎవ్వరు నీకు ప్రాణపద మేటికి దాచెదవే తలోదరి'. 18. 'సతత మనస్య భోగ్యమైన సంపద', వృత్తాంతము అనే అర్థాలుగల జరుగుతున్న కాలము.



నిలువు: 1. పౌర్ణమి నాటి చంద్రునితో సమానమైన ముఖము గలవాడా అనే సంబోధన, 2. పువ్వు + మన్మథుని + సాధనము అను అర్థమిచ్చు మాటలో చివరి రెండు అక్షరాలు తారుమారైనవి, 3. వినడం, కీర్తించడం, స్మరించడం, పాదసేవ, అర్చన, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మ నివేదనం, అనే 9 రకాలు ఒక మాటలో చెబితే, 4. స్నేహం, చుట్టం, పెద్ద, చిన్న, కన్నె, ఇల్లు మొదలైన వాటికి షష్ఠ్యర్థమునందు వచ్చే ప్రత్యయము. 7. మెత్తని లోహవిశేషం, 11. అగౌరవం, అవమానం అనే అర్థంతో ఆకాశంలో ప్రయాణ సాధనం తారుమారైంది (సూచన:—మున—) 12. ఆలోచన, తలపోయుట, ధ్యానము, ఏకాగ్రత సాధించడానికి మార్గం, 14. దీనివలన సాధించ గలిగేది ఏమీ లేదు, 16. ఆంధ్రదేశంలో డెల్టా భూమిలో ఎక్కువగా పండే పంట విశేషం తారుమారైంది

"సాధు సంగమంబు సకలార్థ సాధనంబు."

## లివికిపరీక్ష

1. ఈ వరుసలో తరువాత వచ్చే సంఖ్య ఏది? 11, 22, 33, 44, 55, 66, 77—;

2. బ్రాకెట్లలో సంఖ్య విలువ ఎంత? 5, 25, ( ), 625.

3. 20 మంది 40 బావులను 60 రోజులలో త్రవ్వగలిగినచో 10 మంది 20 బావులను ఎన్ని రోజులలో త్రవ్వగలరు?

4. 'సందర్భానుసారంగా కాలం గడుపుట' అనే అర్థాన్నిచ్చే తెలుగు జాతీయాన్ని 'ఎండ' 'గొడుగు' అనే పదాలను ఉపయోగించి చెప్పండి.

5. పేరు ప్రఖ్యాతులు లేని వాడగుటచే సోదరుని పేరుతో వ్యవహరించేవాడు - ఎవరు?

6. బాణము అంటు కొనిక ...తే మాట.

7. తెలుగు నాటకరంగంలో సత్యభామ, శకుంతల, చిత్రాంగి, దేవదేవి, చింతామణి, మోహిని, యశోద, అనసూయ, చంద్రమతి, దమయంతి.... మొదలైన స్త్రీపాత్రలను అద్వితీయంగా నటించి స్త్రీపాత్ర నిర్వహణలో అగ్రస్థానం వహించిన సాటిలేని మేటి నటుడు ఎవరు?

8. 'సీతమ్మ మాయమ్మ — శ్రీరాముడు మా తండ్రి' అనే పల్లవితో ప్రారంభమయే పాట రచించిన వాగ్గేయ కారకుడు ఎవరు?

## వినోదమ్
## పోటీల కూపను
### సెప్టెంబరు 1985

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని అర్థాలను గుర్తించండి.

1. అనముడు: పేరులేనివాడు (ఎ), బ్రాహ్మణుడు (బి), సన్యాసి (సి), సంతానం లేనివాడు (డి).

2. అండదండలు కంఠమందు ధరించే హారములు (ఎ), కలుపుగోలుతనం (బి), సహాయం (సి), భక్ష్య విశేషము (డి).

3. అనామయము: రోగము లేనిది (ఎ), పేరులేనిది (బి), నీరోగము (సి), సంశయము (డి).

4. ఒడుపు: పూనిక (ఎ). లాఘవము (బి), ఉపాయము (సి), ఒడ్డాణము (డి).

5. తిరునీరు: చల్లని నీరు (ఎ), బురద నీరు (బి), వీభూది (సి), పన్నీరు (డి).

6. భాగ్యము: అదృష్టము (ఎ), సౌభాగ్యము (బి), సుకృతము (సి), న్యాయముతో కూడినది (డి).

7. వంత: సంతాపం (ఎ), బాధ (బి), ఏడు (సి), రాగము (డి).

8. వదాన్యుడు: మిక్కిలి ఇచ్చువాడు

"విద్య నిగూఢ గుప్తమగు విత్తము" ...

"విద్య విశిష్ట దైవతము విద్యకు సాటి ధనంబులేదిలన్
విద్య నృపాల పూజితము విద్యనెరుంగని వాడు మర్త్యుడే."

## విసదము
### పోటీల సూచన
### సెప్టెంబరు 1985

(ఎ), మనోజ్ఞముగా మాటలాడు (బి), నమస్కరింప దగినవాడు (సి), దండింపదగినవాడు (డి)

## ముఖచిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 ఖరీదు చేసే పుస్తకం బహుమతి.

## మీరైతే...?

'పరిశ్రమలు కంప్యూటర్ల మయమైతే' మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## భావపరిచయ పోటీ







8 మాటలకు మించకుండా పైన కనిపిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి చమత్కారమైన, లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

### మాటలు చేతలు

పసి బిడ్డల యోగ్యతాభివృద్ధిలో తల్లిదండ్రుల ప్రతి మాట, ప్రతి చేత చాలా ముఖ్యమైనవి. సంఘంలో వారిని భావి పౌరులుగా తీర్చిదిద్దుతాయి. —డేవిడ్ విల్ కిర్‌సన్

---

"ఏ నరునకు విత్తముగల దానరుడు కులీను డధికుడార్యుడతండే
దీవిధి ధన్యుడు నేర్పరి, నానా గుణగణము కాంచనంబున నిలుచున్."

# పోటీలు (ఫలితాలు)

(జూలై 1985)

వ్యాసం: విజేతలు: మొదటి బహుమతి: నా. వీరయ్య యాదవ్. ఓరుగల్లు: రెండవ బహుమతి: జి. అలిమేలు. కాజీపేట, (కడప జిల్లా); మూడవబహుమతి: డి. చలపతి రావు, రంగశాయి పేట. (వరంగల్ జిల్లా).

క్విజ్—జవాబులు: 1. కాండ్లరేవు గుజరాత్‌లో కలదు, 2. ఓర్నిథాలొజిస్టు (పక్షి శాస్త్రవేత్త), 3. అల్యూమినియం. 4. భారత దేశం, 5. అబద్ధము, 6. ఇంటర్నేషనల్ ఫండ్ ఫర్ అగ్రికల్చరల్ డెవలప్‌మెంట్ (వ్యవసాయాభివృద్ధికి అంతర్జాతీయ నిధి), 7. హాకీ, 8. చింపాంజీ, 9. ఇంగ్లాండ్, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్, ఇండియా, పాకిస్తాన్, వెస్ట్ ఇండీస్, 10. వ్యాపారం విత రణ చేయును, పరిశ్రమ ఉత్పత్తి చేయును.

విజేతలు: మొదటి బహుమతి. ఎమ్. వెంకటేశ్వర్లు, బి. కొత్తకోట, (చిత్తూరు జిల్లా); రెండవ బహుమతి: ఎ. గీతాంజలి, పొన్నూరు (గుంటూరుజిల్లా): మూడవబహుమతి: పి. శ్రీనివాస్ కుమార్, విజయవాడ.

పజిల్ - జవాబులు - అడ్డం: 4. నన్నయ్య తిక్కన్న, ఎఱ్ఱన 5. భారతము, 6. కొనకొని, 7. ముత్యాల హారము, 8. భాగము, 9. అమగానవ, 11. కువలయ దళనయనా.

నిలువు: 1. నవ భారము ఎత్తబోకు, 2. తినుము ఆహారము, 3. ఎర్రన, 4. నదుది తమము పోవునా, 6. కొద్దము, 8. భామ, 9. అబల, 10. సరళ.

విజేతలు: మొదటి బహుమతి: డి. వి. రమణశర్మ ఉండ్రాజవరం, (ప.గో. జిల్లా): రెండవ బహుమతి: బి. ఎస్. వి. దత్తు, గుడివాడ, (కృష్ణాజిల్లా): మూడవ బహుమతి: వి. పద్మ సావిత్రి, ఈమని (గుంటూరు జిల్లా).

తెలివికి పరీక్ష: జవాబులు: 1. (బి) బ్రహ్మ కదిగిన, 2. (ఎ) ఆటవెలది, (బి) ఉత్పలమాల, (సి) చంపకమాల, (డి) మత్తేభము, 3. బుద్ధిని, 4. 19½ (ఒకటి, రెండు (½) కలిపి), 5. 10 ఉమ్మల ముక్కను ఒక చేత్తో విరుపు చేస్తారు కాబట్టి, 6. అగ్గిపుల్ల, 7. (ఎ) తూర్పారబెట్టు—మాటలు మీరుట, (బి) చెవి కొరకుట—రహస్యము చెప్పుట, (సి) వెట్టిపుట్టు—భాగ్య వంతుడుగా పుట్టుట, (డి) మడి కట్టుకొనుట—శ్యాయ మార్గంలో నడచుట, 8. తలుపు తెరచి ఉంచినపుడు.

విజేతలు: మూడవ బహుమతి: ఎస్. మమతా క్రిస్టియానా, ఏలూరు (ప.గో. జిల్లా): పి. భాస్కర్, పెరుమాలి (విజయ నగరం జిల్లా).

మాటల మహిమ - జవాబులు: 1.

రజ్జువు (ఎ), త్రాడు (బి), 2. ధర్మ విచారం (ఎ), కపటము (బి), 3. అలి (ఎ), ఉంగరము (బి), 4. దరిద్రము (ఏ), శూన్యం (బి), 5. నెయ్యి (ఏ), మేఘము (బి), 6. శీలము (ఏ), కులము (డి), 7. పక్షి (బి), సింహము (సి), శరభము (డి), 8. నిర్దోషము (బి), నిర్మలము (డి).

విజేతలు - మొదటి బహుమతి: డి.వి. రమణశర్మ, ఉండ్రాజవరం, (ప.గో. జిల్లా), రెండవ బహుమతి: పొన్నలూరి జానకిరామ్, ఒంగోలు, (ప్రకాశం జిల్లా, మూడవ బహుమతి: బసాని శైలేష్ కుమార్, వరంగల్.

ముఖచిత్ర వ్యాఖ్య - మొదటి బహుమతి ఏ గీతాంజలి. పొన్నూరు (గుంటూరు జిల్లా), రెండవ బహుమతి: కె. విజయ కుమార్, హైదరాబాద్; మూడవ బహుమతి: కె. సత్యనారాయణ, బుచ్చిరాజుపాలెం పోస్టు, విశాఖపట్టణం.

పాఠకుల అభిప్రాయాలు: మొదటి బహుమతి: ఎన్. రాజశేఖర్, ఇల్లిందు, (ఖమ్మం జిల్లా): రెండవ బహుమతి: పడాల శివశంకర మూలారెడ్డి, విజయవాడ; మూడవ బహుమతి: బి.ఎస్. మాధురి, జేకేపూర్ పోస్టు (ఒరిస్సా).

మీరైతే....? - మొదటి బహుమతి: ఎన్. రాజశేఖర్, ఇల్లిందు, (ఖమ్మం జిల్లా): రెండవ బహుమతి: కె కనక దుర్గ, ఆత్మకూరు. (కర్నూలుజిల్లా);మూడవ బహుమతి: పిట్టల చలపతిరావు, మన్న, (కృష్ణాజిల్లా).

భావపరిచయ పోటీ - మొదటి బహుమతి. వి. జగదీశ్, వరంగల్; రెండవ బహుమతి: ఎన్. రాజశేఖర్, ఇల్లిందు, (ఖమ్మం జిల్లా); మూడవ బహుమతి: ఎస్. మధుసూదనరావు,వసుంధర (శ్రీకాకుళంజిల్లా) ●

---

(7 వ పేజీ తరువాయి)

అగ్గిపుల్లల మందులో పది రకాల రాసాయనిక పదార్థాలు చేరి ఉన్నాయి. ఒకటో రకం అగ్గిపుల్లలకు ఉండవలసిన లక్షణాలు - అగ్గిపుల్లలు సులభంగా గీసిన వెంటనే అంటుకోవాలి. ఒకే పరిమాణంలో మంట మండాలి. మంట నిలకడగా మండాలి. సులభంగా ఆరిపోవాలి. కాని ఊపిరి విడిస్తే ఆరిపోయేటట్టుగా ఉండకూడదు.

మన భారత దేశంలో తయారయే అగ్గిపుల్లలు విదేశాలలో తయారయే అగ్గిపుల్లల విశిష్టతకు ఎంతమాత్రం తీసిపోలేదు. కాని అగ్గిపుల్లల తయారీకి ఉపయోగించే చెక్క మాత్రం అంత నాణ్యమైనది కాదు. 1923 వ సం. లో స్వీడిష్ మాచ్ కంపెనీవారు భారత దేశపు అడవులలో పర్యటించి అగ్గిపుల్లల తయారీకి అనువైన చెక్క ఇచ్చట దొరకదని నిర్ణయించారు, కాబట్టి ప్రారంభంలో మన దేశంలో అగ్గిపుల్లల తయారీకి చెక్కను (match wood) ఫిన్‌లాండ్, పోలండ్, రష్యాల నుండి దిగుమతి చేసుకొనేవారు. తరువాత మన దేశంలో ఏ చెక్కదొరికితే ఆ చెక్క - లభ్యమయ్యే ప్రతీ చెక్కను ఉపయోగించి అగ్గిపుల్లల తయారీకి పూనుకున్నారు. ఈ నాడు మన దేశంలో తయారీకి అనువుగాని మమారు 40-50 రకాల చెక్కను ఉపయోగించి అగ్గిపుల్లలను తయారుచేస్తున్నారు. ●

---

"అభిమానవంతు డెందయిన శత్రు కృత తిరస్కార మెట్లు సహించ నేర్చు?"

EDITED AND PUBLISHED BY K V GOVINDA RAO

AT No 9, DESIKA ROAD, MYLAPORE, MADRAS-600 004 (INDIA)

PRINTED BY D. SRIDHARA RAO, AT KRANTI PRESS.

MADRAS-600 001 (INDIA)

